శ్రీనివాసరావు, వారణాసి

# కావ్యసంగ్రహము

బెజవాడ, 1927

Record no. 463

SUNDARAYYA VIGNANA KENDRAM
1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

## Bibliographic Record Target

శ్రీనివాసరావు, వారణాసి.

కావ్యసంగ్రహము / సంగ్రథిత కర్త వారణాసి శ్రీనివాసరావు. - బెజవాడ : వెంకటరామ్ అండ్ కో., 1927.

156 p. ;19 cm.

Record no. 463

Śrīnivāsarāvu, Vāraṇāsi.

Kāvyasaṅgrahamu / saṅgrathita karta Vāraṇāsi Śrīnivāsarāvu. - Bejavāḍa : Veṅkaṭarām aṃḍ Kō., 1927.

156 p. ;19 cm.

Record no. 463

35 mm microfilm
Image placement: IA IIA IB IIB
Date filming began:

శ్రీ

# కావ్యసంగ్రహము.

నన్నయభట్టు - భారతము
తిక్కనసోమయాజి - భారతము   2993
ఎఱ్ఱాప్రగడ - భారతము
నాచనసోముని - ఉత్తరహరివంశము
బమ్మెర పోతనామాత్యుని - భాగవతము

లనుండి గ్రహింపఁబడినవి.



సంగ్రహితకర్త :
వారణాసి శ్రీనివాసరావు, ఎం. ఎ., ఎల్. టి.,
ప్రధానోపాధ్యాయుఁడు, హిందూహైస్కూలు,
మచిలీపట్టణము.

---

ప్రకటనకర్తలు :
వెంకటరామ్ అండ్ కో,
బుక్కుసెల్లర్సు, ఎడ్యుకేషనల్ పబ్లిషర్సు,
బెజవాడ.



**1927.**

కాపీరైట్ రిజస్టర్డు.

# విషయసూచిక.





# కావ్యసంగ్రహము.

## I

## నన్నయభట్టు (భారతము)

—* అవతారిక. *—

శ్రీవాణీగిరిజా శ్చిరాయ దధతో వక్షో ముఖాఙ్గేషు యే
లోకానాం స్థితిమావహ న్త్యవిహతాం స్త్రీపుంసయోగో
ద్భవామ్
తేవేదత్రయమూ ర్తయ స్త్రిపురుషా స్సమ్పూజితా వస్సురై
ర్భూయాసుః పురుషోత్తమామ్బుజభవశ్రీకన్ధరా శ్శ్రేయసే.

వ. అని సకలభువనరక్షణప్రభువులై యాద్యులైన హరిహరహిరణ్యగర్భ పద్మోమావాణీపతుల స్తుతియించి తత్ప్రసాద సమాసాదిత నిత్యప్రవర్ధమాన మహామహీరాజ్య విభవుండును, నిజ భుజవిక్రమ విజితారాతి రాజనివహుండును, నఖిల జగజ్జేగీయమాన నానాగుణరత్న రత్నాకరుండును నై పరఁగుచున్న రాజరాజనరేంద్రుండు.

ఉ. రాజకులైకభూషణుఁడు రాజమనోహరుఁ డన్యరాజ తే
జోజయశాలి శౌర్యుఁడు విశుద్ధ యశశ్శరదిందుచంద్రికా
రాజిత సర్వలోకుఁ డపరాజిత భూరిభుజాకృపాణధా
రాజలశాంతశాత్రవపరాగుఁడు రాజమహేంద్రుఁ డున్నతిన్

క. విమలాదిత్యతనూజుఁడు
విమలవిచారుఁడు కుమార విద్యాధరుఁ డు
త్తమచాళుక్యుఁడు వివిధా
గమ విజితశ్రముఁడు తుహినకరుఁ డురుకాంతిన్

చ. ఘన దురితానుబంధ కలికాలజ దోషతుషారసంహతిం
దన యుదయప్రభావమున దవ్వగఁ జోపి జగజ్జనానురం
[1]జనమగు రాజ్యసంతతవసంత నితాంత విభూతి నెంతయుం
దనరఁ జళుక్యమన్మథుఁడు ధర్మదయార్ద్రనిబద్ధబుద్ధియై

ఉ. ఆశ్రితపోషణంబున ననంతవిలాసమునన్ మనీషి వి
ద్యాశ్రిమతత్త్వ విత్త్వమున దానగుణాభిరతిన్ సమస్తవ
ర్ణాశ్రమ ధర్మరక్షణమహామహిమన్ మహినొప్పు సర్వలో
కాశ్రియుఁ డాదిరాజనిభుఁ డత్యకలంకచరిత్రసంపదన్.

సీ. నిజమహీమండలప్రజఁ బ్రీతిఁ బెంచుచుఁ
బరమండలంబుల ధరణిపతుల
నదిమి కప్పంబుల ముదముతోఁ గొనుచును
బలిమి నీయని భూమివలయపతుల

1 క. ఖ. గ. ఘ. 'జన మగురాజ్య;' 'జనముగ రాజ్య' అ. ప్ర



నుక్కడఁగించుచు దిక్కుల దనయాజ్ఞ
వెలిగించుచును విప్రకులము నెల్లఁ
బోషించుచు శరణన్నఁ గాచుచు భీతుల
నగ్రజన్ములకు ననుగ్రహమునఁ

ఆ. జారుతర మహాగ్రహారంబు లిచ్చుచు
దేవభోగములు మహావిభూతిఁ
దనరఁ జేయు చిట్లు మనుమార్గుఁ డగువిష్ణు
వర్ధనుండు వంశవర్ధనుండు.

వ. అఖిలజలధి వేలావలయ వలయిత వసుమతీ వనితా విభూషణంబైన వేఁగిదేశంబునకు నాయకరత్నంబునుం బోని రాజమహేంద్రపురంబునందు మహేంద్రమహిమతోఁ బరమానందంబున ననవరత మహామహీరాజ్యసుఖంబు లనుభవించుచు సకలభువన లక్ష్మీవిలాసనివాసంబయిన రమ్యహర్మ్యతలంబున మంత్రి పురోహిత సేనాపతి దండనాయక దౌవారిక మహాప్రధానానంత సామంత విలాసినీ పరివృతుం డయి యపార శబ్దశాస్త్రపారగు లైన వైయాకరణులును భారతరామాయణాద్యనేకపురాణప్రవీణులైన పౌరాణికులును మృదు మధుర రసభావ భాసుర నవార్థ వచన రచనావిశారదు లయిన మహాకవులును వివిధతర్క విగాహిత సమస్తశాస్త్ర సాగరగరియఃప్రతిభులైన తార్కికులును నాదిగాఁ గలుగు విద్వజ్జనంబులు పరివేష్టించి కొలువ విద్యావిలాసగోష్ఠి సుఖోపవిష్టుం డయి యిష్టకథావినోదంబులనుండి యొక్కనాఁడు,

సీ. తన కులబ్రాహ్మణు ననురక్తు నవిరళ
జపహోమతత్పరు విపులశబ్ద
శాసను సంహితాభ్యాసు బ్రహ్మాండాది
నానాపురాణ విజ్ఞాన నిరతుఁ
బాత్రు నాపస్తంబ సూత్రు ముద్గలగోత్ర
జాతు సద్వినుతావ దాతచరితు
లోకజ్ఞు నుభయభాషా కావ్యరచనాభి
[1]శోభితు సత్ప్రతిభాభియోగ్యు

ఆ. నిత్య సత్యవచను మత్యమరాధిపా
చార్యు సుజను నన్నపార్యుఁ జూచి
పరమధర్మవిదుఁడు వరచళుక్యాన్వయా
భరణుఁ డిట్టు లనియెఁ గరుణతోడ.

చ. విమలమతిం బురాణములు వింటి ననేకము లర్థధర్మశా
స్త్రముల తెఱం గెఱింగితి సుధాత్తరసాన్విత కావ్యనా
క్రమములు పెక్కు సూచితి జగత్పరిపూజ్యము లైనయీశ్వరా
గమములయందు నిల్పితిఁ బ్రకాశముగా హృదయంబు భక్తితోన్.

వ. అయినను నాకు ననవరతంబును శ్రీమహాభారతంబు
నందలి యభిప్రాయంబు విన నభిలాష పెద్దయై యుండు.

మ. ఇవియేనున్ సతతంబు నాయెడఁ గరంబిష్టంబులై యుండుఁ బా
యవు భూదేవకులాభితర్పణ మహీయఃప్రీతియున్ భారత

1. క. ఖ. గ. ఘ. శోభి నిజప్రతిభాభియోగ్య.



శ్రవణాసక్తియుఁ బార్వతీపతిపదాబ్జధ్యానపూజామహో
త్సవమున్ సంతతదానశీలతయు శశ్వత్సాధుసాంగత్యమున్.

వ. మఱి యదియునుం గాక.

చ. హిమకరుఁ దొట్టి పూరుభరతేశకురుప్రభుపాండుభూపతుల్
క్రమమున వంశకర్తలనఁగా మహి నొప్పిన యస్మదీయవం
శమునఁ బ్రసిద్ధులై విమలసద్గుణశోభితులైన పాండవో
త్తములచరిత్ర నాకు సతతంబు వినంగ నభీష్ట మెంతయున్.

చ. అమలసువర్ణశృంగఖురమై కపిలంబగు గోశతంబు ను
త్తమబహువేదవిప్రులకు దానము [1]సేసిన తత్ఫలంబు త
థ్యము సమకూరు భారతకథాశ్రవణాభిరతిన్ మదీయచి
త్తము ననిశంబు భారతకథాశ్రవణ[2]ప్రవణంబ కావునన్.

క. జననుత కృష్ణద్వైపా
యనముని వృషభాభిహిత మహాభారతబం
ధ నిరూపితార్థ మేర్పడఁ,
దెనుఁగున రచియింపు మధికధీయుక్తి మెయిన్.

క. బహుభాషల బహువిధముల,
బహుజనములవలన వినుచు భారతబద్ధ
స్పృహు లగువారికి నెప్పుడు,
బహుయాగంబులఫలంబు పరమార్థ[3]మగున్.

వ. అని యానతిచ్చిన విని యక్కవివరుం డిట్లనియె.

1 "సేసినం దత్ఫలంబు" అ. ప్ర. 2 ఖ. గ. ప్రవణంబుకావునన్.
3 క. ఘ. మిలన్.

చ. అమలినతారకాసముద•యంబుల నెన్నను సర్వవేదశా
స్త్రముల యశేషపారము ము•దంబునఁ బొందను బుద్ధిబా
హువిక్రమమున దుర్గమార్థజల•గౌరవభారత [1]భారతీసము
ద్రముఁ దఱియంగ నీఁదను వి•ధాతృనకైనను నేరఁబోలు నే?

వ. అయినను దేవా! నీయనుమతంబున విద్వజ్జనంబుల యనుగ్రహంబునంజేసి నానేర్చువిధంబున నిక్కావ్యంబు రచియించెద నని.

తరల॥ హరిహరాజ గజాననార్క ష•డాస్యమాతృ సరస్వతీ
గిరిసుతాదిక దేవతాతతి•కిన్ నమస్కృతి సేసి దు
ర్భరతపోవిభవాధిపున్ గురు•పద్యవిద్యకు నాద్యు నం
బురుహగర్భనిభుం బ్రచేతసు•పుత్త్రు భక్తిఁ దలంచుచున్.

ఉ. భారతభారతీ శుభగ•భస్తిచయంబులఁ జేసి ఘోరసం
సారవికారసంతమస•జాలవిజృంభము వాపి సూరిచే
తోరుచిరాబ్జ బోధనర•తుం [2]దగుదివ్యపరాశరాత్మజాం
భోరుహమిత్త్రుఁ గొల్చి ముని•పూజితుభూరియశోవిరాజితున్.

చ. పరమవివేక సౌరభవి•భాసిత సద్గుణపుంజవారిజో
త్కరరుచిరంబులై సకల•గమ్య సుతీర్థములై మహామనో
హరసుచరిత్రపావనప•యఃపరిపూర్ణము లైన సత్సభాం
తరసరసీవనంబుల ము•దం బొనరం గొనియాడి వేడుకన్.

ఉ. పాయక పాకశాసనికి • భారతఘోరరణంబునందు [3]నా
రాయణునట్లు దానును ధ•రామరవంశవిభూషణుండు నా

1 "వాహినీ సముద్రము" అ. ప్ర. 2 ఖ. గ. దగు దివ్యుఁ బరాశరా. 3 క. గ. ఘ. నారాయణుఁడట్లు.



రాయణభట్టు వాఙ్మయధు•రంధరుఁడుం దనకిష్టుఁడున్ సహా
ధ్యాయుఁడు నైనవాఁ డభిమ•తంబుగఁ దోడయి నిర్వహింపఁగన్.

ఉ. సారమతిం గవీంద్రులు ప్ర•సన్నకథా[1]కవితార్థయుక్తి లో
నారసి మేలు నా నితరు • లక్షరరమ్యత నాదరింప నా
నా రుచిరార్థసూక్తినిధి • నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారతసంహితారచన•బంధురుఁ డయ్యె జగద్ధితంబుగన్.



—• యయాతిమహారాజు చరిత్రము •—

క. మనుజాధిప వృషపర్వుం
డను దానవపతికి శుక్రుఁ • డాచార్యుండై
యనిమిషవిరోధులకుఁ బ్రియ
మొనరించుచు వివిధవిధి న•యోపాయములన్.

క. దేవాసురరణమున గత
జీవితు లగు నసురవరులఁ • జెచ్చెర మృతసం
జీవని యనువిద్యఁ బున
ర్జీవులఁ గాఁ బ్రతిదినంబుఁ • జేయుచు నుండెన్.

వ. దాని నెఱింగి దేవత లెల్ల నతిభీతులై యసురుల నోర్వనోపక శుక్రువలన మృతసంజీవని వడసి తేనోపునట్టి మహాసత్త్వుం డెవ్వం డగునో యని విచారించి బృహస్పతి పుత్త్రుండయిన కచునికడకుం జని యిట్లనిరి.

1 క. గ. కలితార్థ.

క. పోరను మృతసంజీవని
కారణమున నిహతు లయ్యుఁ • గా రసురవరుల్
వారల నోర్వఁగ మన కతి
భారము దుర్వారవీర్య • బలయుతు లగుటన్.

క. మనపక్షంబున వార
ద్దనుజులచే నిహతులయ్యుఁ • దగ మృతసంజీ
వని లేమిఁ జేసి యమస
దనమున కరుగుదురు వీర్య•దర్పితు లయ్యున్.

క. కావున మృతసంజీవనిఁ
దేవలయును శుక్రువలన • ధృతిఁ బడసి తప
శ్శ్రీవిభవ దానిబలమునఁ
గావంగా వలయు సురని•కాయబలంబున్.

క. బాలుండవు నియమవ్రత
శీలుండవు, నిన్నుఁ బ్రీతిఁ • జేకొని తద్వి
ద్యా లలనాదానముఁ గరు
ణాలయుఁడై చేయు నమ్మ•హాముని నీకున్.

వ. దుహితృస్నేహంబులం జేసి, యద్దేవయానిపలుకులు శుక్రుం డతిక్రమింపండు గావున నీనేర్పువిధంబున దాని చిత్తంబు వడసి శుక్రు నారాధించిన నీకిష్టసిద్ధి యగునని దేవతలు ప్రార్థించి పంచినం గచుండును దేవహితార్థంబు వృషపర్వుపురంబునకుం జని యచ్చట వేదాధ్యయనశీలుం డయి సకలదానవగణోపాధ్యాయుం డయి యున్న శుక్రుంగని నమస్కరించి యిట్లనియె.



క. ఏను గచుం డనువాఁడ మ
హానియమ సమన్వితుఁడ • బృహస్పతి సుతుఁడన్
మానుగ వచ్చితి నీకును
భానునిభా! శిష్యవృత్తిఁ • బని సేయంగన్.

వ. అనిన నమ్మునికుమారుని సుకుమారత్వంబును వినయప్రియవచన మృదుమధురత్వంబును ననవరత నియమవ్రత ప్రకాశిత ప్రశాంతత్వంబునుం జూచి శుక్రుం డతిస్నేహంబున నీనిం బూజించిన బృహస్పతిం బూజించిన[1] యట్ల యని యభ్యాగత పూజల వాని సంతుష్టుంగాఁ జేసి శిష్యుంగాఁ జేసికొని యున్నంత నక్కచుండు.

సీ. పని యేమి పంచినఁ • బరపడి చేసెద
ననక తన్ బంచిన • యాక్షణంబ
చేయుచు నిజగురు • చిత్తవృత్తికిఁ గడు
ననుకూలుఁడై విన•యంబుతోడ
మనమునఁ జెయ్యుల • మాటల భక్తి నే
కాకారుఁడై మఱి • యంతకంటె
దేవయానికి సువి•ధేయుఁడై ప్రియహిత
భాషణములఁ బుష్ప•ఫలవిశేష

ఆ. దానములను సంత•తప్రీతిఁ జేయుచు
నివ్విధమునఁ బెక్కు•లేండ్లు నిష్ఠ
గురుని గురుతనూజఁ•గొలిచి యయ్యిరువుర
నెమ్మి నడసెఁ దనదు•నేర్పుపేర్మి.

1. క. ఖ. గ. పమానంబని యభ్యాగత.

వ. ఇట్లు గురుశుశ్రూషాకౌశలంబునఁ గచుండు శుక్రునకుం బ్రియశిష్యుండై యున్న నెఱింగి దానవులు సహింపనోపక బృహస్పతితోడి యలుక నక్కచు నొక్కనాఁడు హోమధేనువులం గాచుచు వనంబున నేకతంబ యున్నవాని వధియించి విశాలసాలస్కంధంబున బంధించి చని; రంత నాదిత్యుం డస్తగిరిశిఖరగతుండగుడు, మగిడి హోమధేనువు లింటికివచ్చిన వానితోడన కచుండు రాకున్న దేవయాని దనమనంబున [1]మలమల మఱుంగుచుం బోయి తండ్రి కిట్లనియె.

ఉ. వ్రాఁడిమయూఖముల్ గలుగు ♦ వాఁ డపరాంబుధిఁగ్రుంకె
ధేనువుల్ । నేఁడిట వచ్చె నేకతమ ♦ నిష్ఠమెయిన్ భవదగ్ని
హోత్రముల్ । పోఁడిగ వేల్వఁగాఁబడియెఁ ♦ బ్రొద్దును
బోయెఁ [2]గచుండు నేనియున్ । రాఁడు వనంబులోన మృగ♦
రాక్షసపన్నగబాధ నొందెనో?

—*కచుండు దానవహతుండై మృతసంజీవనిచే బ్రదుకుట*—

వ. అనిన విని శుక్రుండు దనదివ్యదృష్టి నసురవ్యాపాదితుండైన కచుంగని వానిం దోడ్కొని తేర మృతసంజీవనిం బం

1. క. ఖ. "మలమల మఱుఁగుచు" ఇట్లె "నడునడనడంకుచు" "వెలవెలఁ బోవుచు" అని ద్విరుక్తములం గొన్నిటఁ బూర్వరూప మదంతముగాను బరరూప మదంతముగాను వ్రాఁత ప్రతులఁ జూపట్టుచున్నవి. 2. "నేని" యని "ఏని"కి రూపాంతరము. "ఎన్నఁడు, న్నని మోఘము గాదు దిగ్ధరణిరవీందు లెఱుఁగఁగాఁ" (ఆది-౭-౧౪౧.) "నీవుఁజూచి తట్టిసభ ♦ నేని వినంబడదు" (సభా. ౨.౯౫.) "అతల కెద్దియుట లేదు నేనియున్" (విరాట. ౪. ౧౯౨).



చిన నదియును బ్రసాదంబని యతిత్వరితగతిం జని విగతజీవుండయిన కచు నప్పుడ సంజీవితుం జేసి తోడ్కొని వచ్చినం జూచి శుక్రుండును దేవయానియు సంతసిల్లి యున్నంతఁ గొన్నిదినంబులకు వెండియు నొక్కనాఁడు,

క. అడవికిఁ బువ్వులు దేరఁగ,
వడి నరిగిన కచునిఁ జంపి ♦ వానిని దనుజుల్
పొడవు సెడఁ గాల్చి సురతో
డడయక యబ్బూది శుక్రుఁ ♦ ద్రావించి రొగిన్.

వ. శుక్రుండును సురాపానమోహితుం డయి యున్నఁ దొల్లింటియట్ల దేవయాని గచుం గానక దుఃఖితయై నేఁడును గచుండు రాక మసలె నసురులచేత నిహతుండయ్యెం గావలయునని శోకించిన దానింజూచి శుక్రుం డిట్లనియె.

క. పగవక సంజీవనిపెం
పగణితగర్వమున నసుర ♦ లాకచుతోడం
బగఁ గొని చంపెద రాతఁడు
సుగతికిఁ జనుఁ గాక యేల ♦ శోకింపంగన్?

వ. అనిన దేవయాని యి ట్లనియె.

మ॥ మతిలోకోత్తరుఁడైనయంగిరసుమ♦న్మం డాశ్రితుం డాబృహ
స్పతికిం బుత్త్రుఁడు మీకుశిష్యుఁడు సురూ♦పబ్రహ్మచర్యాశ్రమ
వ్రతసంపన్నుఁ డకారణంబ దనుజ♦వ్యాపాదితుం డైన న
చ్చ్యుతధర్మజ్ఞమహాత్ము నక్కచున కే♦శోకింప కెట్లుండుదున్?

వ. వానిం జూచికాని కుడువ నొల్లనని దేవయాని యేడ్చుచున్నఁ బెద్దయుం బ్రొద్దునకుఁ బ్రసన్నుండై శుక్రుండు

దనయోగదృష్టిం జూచి లోకాలోకపర్యంత భువనాంతరంబునఁ గచుం గానక సురాసమ్మిశ్రభస్మమయుండై తనయుదరంబున నున్న యక్కచుం గని సుర సేసినదోషంబును నసురులవలన నైన యపకారంబును నెఱింగి.

ఆ. మొదలిపెక్కుజన్మ♦ములఁ బుణ్యకర్మముల్
పరఁగఁ బెక్కు సేసి ♦ పడయఁబడిన
యట్టియెఱుక జనుల♦ కాక్షణమాత్రన
చెఱుచు మద్యసేవ♦ సేయనగునె?

క. భూసురు లాదిగఁ గల జను
లీసుర సేవించిరేని ♦ యిది మొదలుగఁ బా
పాసక్తిఁ బతితు లగుదురు
చేసితి మర్యాద దీనిఁ ♦ జేకొనుఁడు జనుల్.

వ. అని శుక్రుండు సురాపానంబు మహాపాతకంబుగా శపియించి తనయుదరంబుననున్న కచు నప్పుడ సంజీవితుం జేసిన నంద యుండి కచుండు శుక్రున కిట్లనియె.

క. తనువును జీవము సత్త్వం
బును బడసితి నీప్రసాద♦మున నీయుదరం
బనఘా వెలువడుమార్గం
బొనరింపుము నాకు భూసు♦రోత్తమ దయతోన్.

వ. అనిన, నాయుదరంబు భేదిల్లినంగాని యిమ్మునికుమారుండు వెలువడ నేరం డుదరభేదనంబున మూర్ఛితుండ నయిన నన్ను సంజీవితుం జేయవలయునని శుక్రుండు కచునకు సంజీవని నుపదేశించిన.



క. ఉదరభిదాముఖమున న
భ్యుదితుండై నిర్గమించె ♦ బుధనుతుఁడు కచుం
డుదయాద్రిదరీముఖమున
నుదితుం డగుపూర్ణహిమమ♦యూఖుఁడు పోలెన్.

వ. అంత.

తే. విగతజీవుఁడై పడియున్న ♦ వేదమూర్తి
యతనిచేత సంజీవితుఁ♦డై వెలింగె
దనుజమంత్రి యుచ్చారణ ♦ దక్షుచేత
నభిహితం బగుశబ్దంబు♦నట్లపోలె.

వ. ఇట్లతిప్రయత్నంబునఁ గచుండు శుక్రువలన సంజీవని వడసి పెద్దకాలంబుండి యొక్కనాఁడు శుక్రుచేత ననుజ్ఞాతుం డయి దేవలోకంబునకుం బోవుచుండి కచున కిట్లనియె.

ఉ. నీవును బ్రహ్మచారివి వి♦నీతుఁడ, వేనును గన్యకన్ మహీ
దేవకులావతంస రవి♦తేజ వివాహము నీకు నాకు మున్
భావజశక్తి నైన యుచి♦పన్నుగ నన్నుఁ బరిగ్రహింపు సం
జీవనితోడ శుక్రుదయఁ♦ జేయుము నాకుఁ [1]ప్రియంబు నావుడున్.

క. ఆకచుఁ డత్యంతనిషాఁ
దాకులుఁడై లోకనింద్య♦మగునర్థము నీ
వాకునకు దెచ్చు టుచితమె,
నాకు సహోదరివి నీవు ♦ నాచిత్తమునన్.

1. క. గ. ఘ. నాకు మనఃప్రియంబగున్ వ. నావుడు.

క. గురులకు శిష్యులు పుత్త్రులు,
పరమార్థము లోకధర్మ • పథ మది దీనిం
బరికింపక యీపలుకులు,
తరుణీ! గురుపుత్త్రి! నీకుఁ • దగునే పలుకన్?

—*{ దేవయానియుఁ గచుండు నొకరి నొకరు శపియించుకొనుట. }*—

వ. అనిన నాకచునకు దేవయాని కరం బలిగి 'నీవు నా మనోరథంబు విఫలంబుగాఁ జేసినవాఁడవు, నీకు సంజీవని పని సేయకుండెడు' మని శాపం బిచ్చినఁ గచుం 'డేను ధర్మపథంబు దప్పనివాఁడను, నీవచనంబు నాకు సంజీవని పని సేయదయ్యె నేని నాచేత నుపదేశంబు గొన్నవారికిఁ బనిసేయుంగాక. మఱి నీవు ధర్మవిరోధంబు దలంచితివి కావున నిన్ను బ్రాహ్మణుండు వివాహంబు గాకుండెడు' మని దేవయానికిఁ బ్రతిశాపం బిచ్చి తత్క్షణంబ.

క. దేవగురునందనుం డమ
రావాసంబునకు నరిగి • యమరులకును సం
జీవని యుపదేశించి సు
ధీవిభుఁ డొనరించుచుండె • దేవహితంబుల్

వ. ఇట వృషపర్వకూతురు శర్మిష్ఠ యనుకన్యక యొక్కనాఁడు కన్యకాసహస్రపరివృతయయి దేవయానీసహితంబు వనంబునకుం జని యొక్క సరోవరతీరంబునఁ దమతమ పరిధానంబులు వెట్టి జలక్రీడ లాడుచున్న నవి సురగురువలిచేతం బ్రేరి



తంబులయి కలసిన నొండొరులం గడవ గొలను వెలువడి సంభ్రమంబున నక్కన్యక లన్యోన్య పరిధానంబులు వీడ్వడం గొని కట్టునెడ దేవయానిపుట్టంబు శర్మిష్ఠ గట్టుకొనిన మఱి దానిపరిధానంబు దేవయాని పుచ్చుకొనక రోసి శర్మిష్ఠం జూచి యిట్లనియె.

క. లోకోత్తరచరితుం డగు,
నాకావ్యతనూజ నీకు • నారాధ్యను నేఁ
బ్రాకటభూసురకన్యక,
నీకట్టినమైల గట్ట • నేర్తునె యనినన్.

వ. శర్మిష్ఠ యిట్లనియె.

క. మాయయ్యకుఁ బాయక పని
సేయుచు దీవించి ప్రియము • సేయుచునుండున్
మీయయ్య వెండి మహిమలు
నాయొద్దన పలుక నీకు • నానయు లేదే?

వ. నాకట్టిన పుట్టంబు నీకుం గట్టం గాదు గాకేమియని గర్వంబున నెగ్గులాడి దేవయాని నొక్కనూతం ద్రోచి శర్మిష్ఠ కన్యకాసహస్రపరివృత యయి క్రమ్మఱివచ్చి నిజనివాసంబున నుండె నంత.

—* యయాతి నూతంబడిన దేవయాని నుద్ధరించుట *—

ఉ. ఆనహుషాత్మజుం డగు య•యాతి యధిజ్యధనుస్స
హాయుఁడై
యానతశాత్రవుండు మృగ•యారసలోలనిబద్ధబుద్ధిఁ ద

త్కాననమెల్లఁ గ్రుమ్మరి ని • కామపథశ్రముఁ డేఁగుదెంచె నం
దానలినాక్షి యున్న విపి • నాంతరకూపతటంబు నొద్దకున్.

సీ. చనుదెంచి యమ్మహా • జనపతి జల మపే
క్షించి యచ్చో విశ్రీ • క్షించి చూచి
తత్కూపమున విల • సత్కూలఘునవల్లి,
[1]యన్నిష్టసఖి నూఁది • యున్నదాని
గురుకుచయుగముపైఁ • బరువడిఁ దొరఁగెడు
కన్నీరు పూరించు • చున్నదానిఁ
దనసమీపమునకు • జనులయాగమనంబు
పన్నుగాఁ గోరుచు • నున్నదాని

ఆ. వరుణదేవుతోడఁ • గర మల్గి జలనివా
సంబు విడిచి భూస్థ • లంబువలని
కరుగుదేర నున్న • వరుణేంద్రు దేవియ
పోనిదాని దేవ • యానిఁ గనియె.

వ. కని, నీ వెవ్వరిదాన విట్లేల యేకతంబ యివ్విపినాంతరకూపంబున నున్నదాన వనిన విని దేవయాని యెప్పుడుం దమవిహారించుచున్న యవ్వనంబునకు మృగయావినోదార్థంబు యయాతి వచ్చుటజేసి తొల్లియుఁ జూచినదిగావున నాతని నెఱింగి యిట్లనియె.

తరల॥ అమరసన్నిభ యేను ఘోరసు • రాసురాహవభూమి న
య్యమరవీరులచేత మర్దితు • లైనదానవులన్ గత

1. "అన్న + ఇష్టసఖి = అన్నిష్టసఖి" అని యిట సంధి తెలియునది.



భ్రీములఁగాఁ దనవిద్యపెంపునఁ • బ్రాప్తజీవులఁ జేసి య
త్యమితశక్తిమెయిన్ వెలింగిన • యట్టి భార్గవుకూఁతురన్.

వ. దేవయాని యనుదానఁ బ్రమాదవశంబున నిన్నూతంబడి వెలువడ నేర కున్నదానను. న న్నుద్ధరించి రక్షింపుమనిన నవ్విప్రకన్యకయందుఁ దద్దయు దయాళుం డై.

చ. జలధివిలోలవీచి విల • సత్కలకాంచి సమంచితావనీ
తలవహనక్షమంబయిన • దక్షిణహస్తమునం దదున్నమ
ద్గళదురుఘర్మవారికణ • కమ్రకరాబ్జము వట్టి నూతిలో
వెలువడఁగోలిం దిగిచె • విశ్రుతకీర్తియయాతిప్రీతితోన్.

వ. ఇట్లు దేవయాని నుద్ధరించి యయాతి నిజపురంబున కరిగె; నిట దేవయానియు శర్మిష్ఠ సేసిన యెగ్గువలన విముక్త యయి తన్ను రోయుచు వచ్చుదాని ఘూర్ణికయను పరిచారికం గని యేను వృషపర్వుపురంబు సొరనొల్ల శర్మిష్ఠచేత నాపడిన యవమానంబు మదీయజనకున కెఱింగింపుమని పంచిన నదియును నతిత్వరితగతిం జని తద్వృత్తాంతంబంతయు శుక్రునకుం జెప్పిన శుక్రుండును నాక్షణంబ కోపఘూర్ణిత బాష్పపూరితనయన యై యున్న దేవయానిం గని యిట్లనియె.

క. అనుపమనియమాన్వితు లై,
యనూనదక్షిణలఁ గ్రతుస • హస్రంబులు సే
సినవారికంటె నక్రో
ధనుడు గరం బధికుఁ డండ్రు • తత్త్వవిధిజ్ఞుల్.

క. అలిగిన నలుగక యెగ్గులు
పలికిన మఱి వినని యట్లు • ప్రతివచనంబుల్
పలుకక బన్నమువడి యెడఁ
దలఁపక యున్నతఁడ చూవె • ధర్మజ్ఞుఁ డిలన్.

వ. కావున బుద్ధి గలవారికిఁ గ్రోధంబు గొనియాడం దగదు. శర్మిష్ఠ రాచకూఁతురు. గొండొకయది దానితోడి దేమి రవ్వనిన దేవయాని యిట్లనియె.

క. కడునను రక్తియు నేర్పును
గడఁకయుఁ గలవారి నుఱక • కడవంగ నెగ్గుల్
నొడివెడు వివేకశూన్యుల
కడ నుండెడు నంతకంటెఁ • గష్టము గలదే!

వ. ఈ వృషపర్వపురంబు చేను జొర నొల్ల నెటయేనియుం బోదు ననిన శుక్రుండు నాకు నీవ గతివి, నీతోడ నేనును వత్తు ననుచుఁ గూఁతుం బట్టువఱుచుచున్నంత నంతయుఁ జారులవలన నెఱింగి వృషపర్వుండు శుక్రునొద్దకు వచ్చి నమస్కరించి యిట్లనియె.

ఉ. దేవతలన్ జయించుచు నతిస్థిరసంపదలం ద్వదీయవి
ద్యావిభవంబు పెంపునను • దానవు లుద్ధతులైరి కానినాఁ
డీవనరాశిలోఁ జొరరె • యింతకు నంతక కోపులైన య
ద్దేవపతాకినీపతుల • దివ్యనిశాత మహాయుధాహతిన్.

క. వారణ ఘోటక భాండా
గారంబులు మొదలుగాఁగఁ • గలధనములతో
సూరినుత! యిందఱము నీ
వారకములు గాఁగ మమ్ము • వగవుము బుద్ధిన్.



వ. ఈ దేవయాని కెద్ది యిష్టంబు దానిన యిత్తు నడుగు మనిన దేవయాని సంతసిల్లి యట్లేని శర్మిష్ఠఁ గన్యకాసహస్రంబుతో నాకు దాసిగా నీవలయు, నిదియ నాకిష్టంబు; దీనిన యిచ్చునది యనిన వృషపర్వుం డప్పు డక్కూఁతు రావించి కన్యకాసహస్రంబుతో దేవయానికి దాసిగా నిచ్చి శుక్రునకు మనఃప్రియంబు సేసిన శర్మిష్ఠయు నగ్గురువచనంబునఁ గన్యకాసహస్రంబుతో నిత్యంబును దేవయానిం గొలుచుచుండె నంత నొక్కనాఁడు.

క. వనకేళీకౌతుకమునఁ
జనియెను శర్మిష్ఠఁ దోట్టి • సఖు లెల్ల ముదం
బునఁ గొలిచి రాఁగ విభవము,
దన కమరఁగ దేవయాని • తద్వనమునకున్.

వ. ఇట్లరిగి దేవయాని యవ్వనంబునఁ గన్యకలుం దానును బుష్పావచయంబు సేయుచు విమలజలప్రవాహవిలసితంబైన యొక్క సెలయేటికెలన నవవికచకుసుమ సుకుమార కోరకనికరభరిత సహకార కురవక వకుళాశోక తమాలసాలచ్ఛాయాశీతలసికతాతలంబున నిష్టవినోదంబుల నున్న యవసరంబున,

సీ. అంగనాజనుల యుత్తుంగసంగత కుచ
కుంకుమ చందన • పంకములయు
వారివ ధమ్మిల్ల • భారావకలిత ది
వ్యామోద నవపుష్ప • దామములయు

వారివ ముఖస కర్పూరతాంబూలాది
వాసనాసురభి నిశ్శ్వాసములయు
వారివ పరిధాన చారుధూపములయు
విలసితసౌరభావలులు దాల్చి

తే. యనిలుఁ డనుదాంత వాయితోడ్కొనియుఁ దెచ్చె
దేవయానిపాలికి మృగతృష్ణఁ జేసి
కాననంబునఁ గ్రిమ్మరువాని వీరు
నతిపరిశ్రాంతుఁ డైన యయాతి నంత.

క. తరళ నయనాబ్జదళములు
నెరయఁగఁ బై మున్ను చల్లి నృపసుతుఁ బూజిం
చిరి నవకుసుమమయాలం
కరణవిశేషముల నచటి కాంతలు ప్రీతిన్.

వ. అయ్యయాతియుఁ దత్ప్రదేశంబున సుఖోపవిష్టుండై, మీ రెవ్వరివారలు, మీకులగోత్రనామంబు లెఱుంగ వలతుం జెప్పుం డనిన రాజునకు దేవయాని యిట్లనియె.

తే. నన్ను మున్న యెఱుంగుది న్నాతివాకు
దాసి వృషపర్వుఁడను మహాదానవేంద్రు
కన్య నాయొద్ద నెప్పుడుఁ గదలకుండు,
ననఘ! మఱి దీని శర్మిష్ఠ యండ్రు జనులు.

ఉ. నిగ్రహ మేది నన్ను ధరణీవర! రూపము వెల్వరించు నాఁ
డుగ్రమయూఖసాక్ష్యముగ నున్నతదక్షిణపాణిఁ జేసి భూ



పాగ్రణి! నాదుదక్షిణకరాబ్జము పట్టితి కాన మున్న పా
ణిగ్రహణంబు సేసి తది నీ యెడవిస్మృతిఁ బొందఁ బాడియే?

ఉ. నన్ను వివాహమై నహుషనందన యీలలితాంగిఁ దొట్టియీ
కన్నియ లందఱున్ దివిజకన్యలతో నెనయైనవారు నీ
కున్నతిఁ బ్రీతి సేయఁగ నృపోత్తమ వాసవుఁ బోలి లీలతో
నన్నరలోకభోగము లనేకము లందుము నీవు నావుడున్.

వ. క్షత్త్రియకన్యకల బ్రాహ్మణులు వివాహం బగుదురుగాక. యధర్మోత్తరంబుగా క్షత్త్రియులు బ్రాహ్మణకన్యకల వివాహం బగుదురే? నీపలుకులు ధర్మవిరుద్ధంబులు. మఱియు సర్వవర్ణాశ్రమధర్మంబులు సంకరంబులు గాకుండ రక్షించుచున్న యేన యిట్టియధర్మంబున కొడంబడితినేని జగత్ప్రవృత్తి విపరీతం బగు ననిన నయ్యయాతికి దేవయాని యిట్లనియె.

క. వెలయఁగ ధర్మాధర్మం
బులు నడపుదు నిఖిలలోకపూజ్యుండై ని
ర్మలుఁ డగుశుక్రుఁడు పంచిన,
నలఘుభుజా! నను వివాహ మగుదే యనినన్.

వ. అమ్మహాముని వచ్చి యిది ధర్మవిరుద్ధంబుగాదని చెప్పెనేని నిన్ను వివాహంబగుదు నని యయాతి యొడంబడిన దేవయాని యప్పుడు శుక్రు రావించిన.

క. తనదివ్యతేజమున న
వ్వన మెల్ల వెలుంగుచుండ వచ్చెను భృగునం

దనుఁడు నిజనందనకుఁ బ్రియ
మొనరింపఁగఁ దలఁచి దాని • యొద్దకుఁ బ్రీతిన్.

క. అతి సంభ్రమమున నవనీ
పతి విహితోత్థానుఁ డై తపశ్శక్తిఁ బ్రజా
పతినిభుఁ డగు భార్గవునకు
నతిభక్తిం బ్రణమితోత్తమాంగుం డయ్యెన్.

వ. మఱియు దేవయానియు శర్మిష్ఠయుం గన్యకాసహస్రంబును నత్యంత భక్తితోఁ గ్రమంబున నమస్కరించి రంత దేవయాని శుక్రున కిట్లనియె.

ఆ. ఇన్నరేంద్రుచేత • మున్న గృహీతనై
యున్న నాకరంబు • గ్రన్న నింక
నొరున కర్హ మగునె • పరిణయ విషయమై
ధరఁ బరిగ్రహింప • బరమమూర్తి!

వ. కావున నాకు నీజన్మంబునఁ బతి యయాతియ; యితండును భవద్వచనంబున నన్ను వివాహం బగుదు ననియె; నిందు ధర్మవిరోధంబు లేకుండునట్లుగాఁ బ్రసాదింప వలయు ననిన శుక్రుండు గరుణించి యయాతికి నీకును నయిన యీ వివాహంబునం దపక్రమదోషంబు లేకుండెడు మని వరం బిచ్చి యయ్యిరువురకుం బరమోత్సవంబున వివాహంబు సేసి, కూఁతు నల్లునిం బూజించిన నయ్యయాతియు శుక్రుని వీడ్కొని దేవయానిని శర్మిష్ఠను గన్యకాసహస్రంబును దోడ్కొని నిజపురంబునకుం జని యంతఃపుర రమ్యహర్మ్యతలంబున దేవయాని



నునిచెను. కొండొక కాలంబునకు దేవయానికి యదు తుర్వసు లను కొడుకులు పుట్టిరి.

## దుష్యంత చరిత్రము.

వ. యయాతికిఁ బుత్త్రుం డయిన పూరుండు సకలమహీరాజ్యంబు సేయుచు వంశకర్త యయిన వానికిఁ గౌసల్య యను దానికి జనమేజయుండు పుట్టి రాజై యశ్వమేధత్రయంబుఁ జేసి ప్రఖ్యాతి నొందె; నా జనమేజయునకు ననంత యను దానికిఁ బ్రాచీశుండు పుట్టి పరాక్రమంబున నుదయాచలపర్యంతంబు ప్రాగ్దిగ్విజయంబు సేసి ప్రాచీశుండు నాఁ బరఁగెఁ; నట్టి ప్రాచీశునకు నశ్మకి యను దానికి సంయాతి పుట్టె; వానికి వరాంగి యను దానికి నహంయాతి పుట్టె; వానికిం గృతవీర్యపుత్త్రి యైన భానుమతికి సార్వభౌముండు పుట్టె; వానికిఁ గేకయరాజపుత్త్రి యైన సునందకు జయత్సేనుండు పుట్టె; వానికి వైదర్భి యైన సుశ్రవసకు నవాచీనుండు పుట్టె; నయ్యవాచీనునకు విదర్భరాజపుత్త్రి యైన మర్యాదకు నరిహుండు పుట్టె; వానికి నాంగి యను దానికి మహాభౌముండు పుట్టె; నా మహాభౌమునకుం బ్రసేనజిత్పుత్త్రి యైన సుపుష్టకు నయుతానీకుండు పుట్టె; వానికిం బృధుశ్రవసుని పుత్త్రి యైన కామకు నక్రోధనుండు పుట్టె; వానికిం గాళింగి యైన కరంభ యను దానికి దేవాతిథి పుట్టె; వానికి వైదేహి యయిన మర్యాదకు ఋచీకుండు పుట్టె; వానికి నాంగి యైన సుదేవ యను దానికి ఋక్షుండు

పుట్టె; ఋక్షునకుఁ దక్షకపుత్త్రియయిన జ్వాల యనుదానికి మతినారుండు పుట్టె.

క. అతనికి సరస్వతీనది
మతి ననురక్త యయి వాని • మానుగఁ దనకుం
బతి జేసికొనియె ధర్మ
స్థితి నయ్యిరువురకుఁ ద్రసుఁడు • ధీరుఁడు పుట్టెన్.

వ. ఆత్రసునకుఁ గాళింది యనుదాని కిలిలుండు పుట్టెఁ; వానికి రథంతరి యనుదానికి దుష్యంతుఁడు పుట్టి యనన్యసాధారణ గుణయుక్తుండయ్యె.

శా. ఆదుష్యంతుఁ డనంతసత్త్వుఁడు సమ•స్తాశాంతమాతంగమ
ర్యాదాలంకృతమైన భూవలయ మా•త్మాయత్తమై యుండఁగా
నాదిత్యాంశుసమీరదుర్గమమహా•గారణ్యదేశాళితో
నాదిక్షత్త్రచరిత్ర నేలె నజితుం•డై బాహువీర్యంబునన్.

క. ఆతనిరాజ్యంబునను
ర్వీతలము ప్రజాసమృద్ధి • వెలసి రుజాశో
కాతంకకలుషశంకా
పేతంబై ధర్మచరితఁ • బెరుఁగుచు నుండెన్.

వ. అమ్మహీపతి యొక్కనాఁడు మృగయావినోదార్థి యయి యాదిత్యహయంబులకంటె వడి గలవాహనంబులు పూనినరథం బెక్కి యాజానేయతురంగారూఢులైన యాశ్వికులు పరివేష్టించి రాఁగ ననంతకుంతశక్తిచాపకృపాణపాణులయిన వీర



భటసహస్రంబులతోఁ జని వనంబులోని మృగంబులం జుట్టి ముట్టి.

క. కలయఁగ నార్పును బొబ్బయు
నులివును నవ్విపిన మనుమ•హోదధిఁ బెలుచం
గలఁచెను దుష్యంతమహా
బల మందరనగము సత్త్వ•భయజననంబై.

క. సరభసపరిచలితమహా
శరభ ద్విపరిపు వరాహ•శార్దూల మద
ద్విరదాదిప్రకరభయం
కరవనమధ్యమున నృపతి • గడుఁ గడిమి మెయిన్.

క. ఓసరిలి పఱచుమృగముల
నేసియు డాసినమృగముల • నెగిచి భుజాసిన్
వ్రేసియుఁ జంపెను మృగయా
వ్యాసక్తి నపారఘోర•వన్యమృగాలిన్.

వ. ఇట్లు పెక్కుమృగంబుల నెగిచి చంపెడువేడుక నతిదూరంబున కరిగిన నాతని రథవేగంబు ననుగమింప నోపక యధికక్షుత్పిపాసాపరవశు లయి పదాతు లయ్యయిప్రదేశంబుల విశ్రమించి; రంత దుష్యంతుండు కతిపయామాత్యపరిజనపురోహిత సహితుండై కొండొకనేల యరిగి ముందట నొక్కపుణ్యనదీతీరంబున వివిధ సురభి కుసుమ ఫలభార వినమ్ర తరు లతా గుల్మ పరిశోభితం బయిన యొక్కవనంబు గని,

క. అమరపతి ఖాండవమునకు
రమణను వైశ్రవణు చైత్ర♦రథమునకు సమా
నముగా దీనిని భూభా
గమునకు రచియించెనొక్కొ ♦ కమలజుఁడు దయన్.

వ. అని దాని రమణీయభావంబుఁ బొగడుచుఁ జను
దెంచి యవ్వనంబు సొచ్చునప్పుడు.

చ. అతిరుచిరాగతుండయిన♦యాతనికిన్ హృదయప్రమోదమా
తతముగ నవ్వనంబున ల♦తాలలనల్ మృదులానిలాపవ
ర్జిత కుసుమాక్షతావళులు ♦ సేసలు వెట్టినయట్టి వైరి సం
పతదళినీ నినాదమృదు♦భాషల దీవనలొప్ప నిచ్చుచున్.

వ. మఱియును.

క. కాఱడవిఁ బఱచుమృగముల
నూఱడకం దిగిచి డస్సి ♦ యున్నతని శ్రమం
బాఱఁగ నెడఁ బరితాపము
దీఱఁగఁ బై వీచె నన్న♦దీ పవనంబుల్.

మాలిని.

ఏచి తనర్చి తలిర్చినక్రోవుల ♦ నిమ్మగురావుల జొంపములం
బూచినమంచియశోకములన్ సుర♦పొన్నలఁబొన్నల గేదఁగులం
గాచి బెడంగుగఁ బండినయాసహ♦కారములం గదళీతతులం
జూచుచువీనులకిం పెసఁగన్ విను♦చున్ శుకకోకిలసుస్వరముల్.



కవిరాజ విరాజితము.

చనిచని ముందట నాజ్యహవిర్ధ్రుత♦సౌరభ ధూమలతాతతులం
బెనఁగినమ్రాకులకొమ్మలమీఁద న♦పేతలలాంతములైనను బా
యనిమధుపప్రకరంబులఁ జూచి జ♦నాధిపుఁడంత నెఱింగెఁ దపో
వనమిది యల్లదె దివ్యమునీంద్ర ని♦వాసము దానగుసందు నెడన్.

వ. ఇట్లు హృదయ సుఖావహం బగుచున్న యవ్వనం
బులో నరిగి యరిగి యనవరత పదక్రమ మహాద్విజ పఠ్యమా
న వేదధ్వనులను నవిచ్ఛిన్న హూయమానాగ్నిహోత్రస్వాహా
శబ్దంబులను ననేక మునిగణప్రణీత వచన విషయ విభాగ
వినిర్ణయన్యాయ నిపుణ విద్వత్సంభాషణ ఘోషంబులను
బ్రతిపక్ష దుర్విభేద ప్రమాణ విచార్యమాణ వేదార్థ మీ
మాంసక గోష్ఠీవివాద నాదంబులనుం జేసి మ్రోయుచు యజ్ఞ
ప్రయోగ ప్రవీణులైన యాజ్ఞికులకును విహితానుష్ఠానాసక్తు
లయిన యనుష్ఠాతలకును నధికతపోనిరతులయిన మహా
తపోధనులకును నివాసంబయిన పుణ్యనదీతీరంబునఁ దద్దయు
రమ్యంబయి గంగాతీరంబున నరనారాయణ స్థానంబునుం బోలె
జగత్పావనం బగుచున్న కణ్వమహాముని యాశ్రమంబుగని యందు.

సీ. శ్రవణ సుఖంబుగా ♦ సామగానంబులు
చదివెడు శుకముల ♦ చదువు దగిలి
కదలక వినుచుండు ♦ కరులును గరికర
శీతలచ్ఛాయఁ ద♦చ్ఛీకరాంబు
కణముల చల్లని ♦ గాడ్పానపడి వానిఁ
జెంది సుఖంబున్న ♦ సింహములును.

భూసుర ప్రవరులు • భూతబలుల్ దెచ్చి
పెట్టు నీవారాన్న • పిండతతులు

తే. గడఁగి భక్షింప నొక్కటఁ • గలసి యాడు
చున్న యెలుకలఁ బిల్లులు • నొండుసహజ
వైరివర్గంబులయు సహ•వాస మపుడు
చూచి మునిశక్తికెంతయుఁ • జోద్యమంది.

వ. ఇక్కాశ్యపుండైన కణ్వమహామునీంద్రునకు నమస్కరించి వచ్చెద; నావచ్చునంతకు నందఱు నిచ్చోటన యుండునది యని.

చ. వలయు సమాత్యులం దగిన•వారలనుండఁగఁబంచి ధారుణీ
తలవిభుఁడొక్కరుండచని•తన్విఁ బయోజదళాయతాక్షి సం
కులమిళితాళి నీల పరి • కుంచిత కోమలకుంతలన్ శకుం
తల యనుకన్యకం గనియెఁ • దన్మునివల్లభుమందిరంబునన్.

వ. అదియును వసంతవిలాసంబున జయంతుండపోని దుష్యంతు నెఱింగి యతిసంభ్రమంబున నాసనార్ఘ్యపాద్యాది విధులం బూజించి కుశలం బడిగియున్న నక్కన్యకం జూచి దుష్యంతుం డిట్లనియె.

ఉ. క్రచ్చఱవేఁటవచ్చి యిటు•కణ్వమహామునిఁజూచి పోవఁగా
వచ్చితి మెందుఁ బోయిరొకొ•వారనినన్ విని యాలతాంగి వా
రిచ్చటనుండి యీక్షణమ • యేఁగిరి కానకుఁ బండ్లుదేర మీ
వచ్చుట యెఱింగిరేని జన•వల్లభ! వారును వత్తు రింతకున్.



వ. వారు వచ్చునంతకు నొక్కముహూర్తం బుండునది యనిన విని యక్కోమలి వినయంబునకు మృదుమధురవచనంబులకు సంతసిల్లి దానిం గన్యకఁగా నెఱింగి మనోజ రాజ్యలక్ష్మియుంబోని దాని సర్వలక్షణలక్షితంబులయిన సర్వావయవంబులుం జూచి సంచలితహృదయుండై నీవెవ్వరికూతుర విట్టి రూపలావణ్య విలాస విభ్రమగుణసుందరి విందులకేల వచ్చితని యడిగిన నది యిట్లనియె.

క. జగతీవల్లభ యేన
త్యగణిత ధర్మస్వరూపుఁ • డని జనములు దన్
బొగడఁగ జగదారాధ్యుం
డగు కణ్వమహామునీంద్రు • నాత్మజ ననినన్.

క. ఈవల్కలాజినములకు
నీవన్యఫలాశనముల • కీనిటపకుటీ
రావాసములకు నుచితమె
నీవిలసితరూపకాంతి•నిర్మలగుణముల్.

ఉ. ఈమునిపల్లె నుండుటిది • యేల కరం బనురాగ మొప్పఁగా
భామిని నాకు భార్య వయి • భాసురలీల నశేషరాజ్యల
క్ష్మీమహనీయసౌఖ్యముల • మేలుగనందు మనిందితేందుపా
దాపలతుంగహర్మ్యముల • హారిహిరణ్మయకుట్టిమంబులన్.

వ. అని దుష్యంతుండు గాంధర్వవివాహస్వరూపంబు సెప్పి శకుంతల నొడంబఱిచిన నది యిట్లనియె.

చ. నరనుత నీప్రసాదమున • నా కుదయించిన నందను౯ మహీ-
గురుతర యౌవరాజ్యమున • కున్ దయతో నభిషిక్తుఁ
జేయఁగా। వరము ప్రసన్న బుద్ధి నన • వద్యముగా దయ
సేయు నెమ్మితో। నిరుపమదార యట్లయిన • నీకును నాకు
ను సంగమం బగు౯।.

వ. అనిన విని శకుంతల కౌతయు సంతోషంబుగా దానికోరినవరం బిచ్చి గాంధర్వ వివాహంబున నభిమతసుఖంబు లనుభవించి యక్కోమలి వీడ్కొని నిన్నుఁ దోడ్కొని రా నస్మత్ప్రధానవర్గంబుఁ గణ్వమహామునిపాలికిం బుత్తెంచెద నని యూఱడ నొడివి దుష్యంతుండు నిజపురంబునకుం జనియె; నిట శకుంతలయుఁ దనచేసినదాని మునివరుం డెఱింగి యలిగెడునో యని వెఱచుచుండె; నంత నమ్మహాముని వనంబుననుండి కందమూలఫలంబులు గొని చనుదెంచి లలిత శృంగారభావంబున లజ్జావనతవదనయు నతిభీతచిత్తయు నై యున్నకూఁతుం జూచి తనదివ్యజ్ఞానంబున నంతవృత్తాంతంబు నెఱింగి క్షత్త్రియులకు గాంధర్వవివాహంబు విధిచోదితంబ యని సంతసిల్లి శకుంతల కిట్లనియె.

తే. తల్లి నీకులగోత్రసౌందర్యములకుఁ
దగినపతిఁ గంటి దానికిఁ • దగఁగ గర్భ
మయ్యె నీదు గర్భమున వా • డఖిలభువన
వహనమహనీయుఁడగు చక్ర • వర్తిసుమ్ము.

వ. నీ ధర్మచరితంబునకు మెచ్చితి. నీవు గోరిన వరం బిచ్చెద వేఁడు మనిన శకుంతలయు నాచిత్తం బెప్పుడు ధర్మ



వునంద తగిలి యుండను నా కుద్భవిల్లెడుపుత్త్రుండు దీర్ఘాయు రైశ్వర్యబల సమన్వితుండును వశంకర్తయుఁ దాను వలయు ననిన నమ్మహాముని కరుణించి దానికోరినవరం బిచ్చి యథాకాలవిధుల గర్భసంస్కార రక్షణంబులు సేయించి యున్నంత వర్షత్రయంబు సంపూర్ణం బైన శకుంతలకు భరతుం డుదయించి కణ్వనిర్వర్తిత జాతకర్మాది క్రియాకలాపుండయి పెరుగుచుఁ గరతలాలంకృత చక్రుండును జక్రవర్తి లక్షణలక్షితుండును సింహసంహననుండును దీర్ఘబాహుండును ననంతజవసత్త్వ పన్నుండును నై పరగుచు.

మ. అమితోగ్రాటవిలోనఁ గ్రుమ్మరు వరాహ వ్యాళ శా
ర్దూల ఖ। డ్గ మదేభాదులఁ బట్టి తెచ్చి ఘనుఁడై • కణ్వా
శ్రమోపాంతభూ। జములం దోలిన కట్టుచుం బలిమిమై •
శాకుంతలుం డొప్పె వన్యమదేభంబుల నెక్కుచుం
దగిలి నానాశైశవ క్రీడలన్.

వ. ఇట్లు వనంబులోని సర్వసత్త్వంబులను దనమహాసత్త్వంబునం జేసి దమియించుచున్న యాతనిం జూచి యాశ్చర్యం బంది యందలి మును లెల్ల నాతనికి సర్వదమనుండను నామంబుఁ జేసిరి. కణ్వమహామునియు నక్కుమారు నుదార తేజోరూప విక్రమగుణంబులకు సంతసిల్లి వీఁడఖిలభువన యౌవరాజ్యాభిషేకంబునకు సమర్థుం డగుదెంచె నని విచారించి యొక్కనాఁడు గూఁతున కిట్లనియె.

ఆ. ఎట్టిసాధ్వులకును • బుట్టిన యిండ్లను
బెద్దకాల మునికి • తద్ద తగదు

పతులకడన యునికి • సతులకు ధర్మువు
సతుల కేడుగడయుఁ • బతుల చూవె.

వ. కావున నీ విక్కుమారునిం దోడ్కొని నీపతిపాలికి నరుగుమని మహాతపోధనులైన తనశిష్యులం గొందఱం దోడు వంచిన శకుంతలయు దౌష్యంతిం దోడ్కొని దుష్యంతుపాలికి వచ్చి సకలసామంత మంత్రిపురోహిత ప్రధాన పౌర జనపరివృతుండై యున్న యారాజుం గనుంగొని.

క. గురునాశ్రమంబునను ము
న్నరుదుగఁ బతివలనఁ గనిన • యనురాగము నా
దరణము ననుగ్రహంబును,
గరుణయు సంభ్రమమునపుడు • గానక యెడలోన్.

క. ఎఱుఁగఁడొకో నన్ను నెఱిఁగియు
నెఱుఁగనియట్లుండు నొక్కొ • యెడ దవ్వగుటన్
మఱచెనొకొ ముగ్ధ లధిపులు
మఱవరె బహుకార్య భార • మగ్నులు గారే.

చ. తలఁపఁగ నాఁడు వల్కినవి•ధం బెడఁ దప్పఁగఁ జూచె
నొక్కొ చూడ్కులువిరసంబులై కరము • క్రూరములైన
నిమిత్తమేమియో! కలయఁగఁ బల్కరించి రుప•కారులు నై
రని నమ్మియుండగా! వలవదు బుద్ధిమంతులు సం•ప్రియు
లైన ధరాధినాథులన్.

వ. అని తలంచి చింతాక్రాంతయై శకుంతల వెండియు నాత్మగతంబున,



క. మఱచినఁ దలఁపింపఁగ నగు
నెఱుఁగనినాఁ డెల్లపాట • నెఱిఁగింప నగున్
మఱి యెఱిఁగి యెఱుఁగ నొల్లని
కఱటిం దెలుపంగఁ గమల•గర్భునివశమే?

వ. అయినను వచ్చి మిన్నక పోవం గాదు. కావున నా పూర్వవృత్తాంతం బెల్ల నెఱింగించి యే నిక్కుమారుం జూపుదు నని మనంబున నిశ్చయించి, శకుంతల యారాజున కిట్లనియె

క. జననాథ! వేటనెపమున
గొనకొని కణ్వాశ్రమమున•కున్ వచ్చి ముదం
బున నందు నాకు నీయి
చ్చినవరము దలంపవలయుఁ • జిత్తములోనన్.

క. బాలార్కతేజుఁ డగు నీ
బాలుఁడు నీకొడుకు వీనిఁ • బౌరవకుల ర
త్నాలంకారు నుదార గు
ణాలయు యువరాజుఁ జేయు • మభిషేకముతోన్.

వ. అనిన విని దుష్యంతుండు దాని నంతయు నెఱింగియు నెఱుంగనివాఁడపోలె ని ట్లనియె.

క. ఏ నెఱుఁగ నిన్ను నెక్కడి
దానవు మిన్నకయ యనుచి•తంబులు పలుకం
గా నేల యరుగు మంబుజ
హాసన! యెందుండి వచ్చి • తందులకు వడిన్.

వ. అనిన విని వెలవెల్లనై వెచ్చనూర్చి నిశ్చేష్టితయై కెందమ్మిరేకులవలనం దొరంగు జలకణంబులపోలెఁ గోపారుణితనయనంబుల బాష్పకణంబులు దొరఁగం దలవాంచి యారాజుం గటాక్షించుచు హృదయసంతాపంబు దనకుఁదాన యుపశమించుకొని పెద్దయుంబ్రొద్దు చింతించి శకుంతల యారాజున కిట్లనియె.

ఆ. ఏల యెఱుకలేని • యితరులయట్ల నీ
వెఱుఁగ ననుచుఁ బలికె • దెఱిఁగి యెఱిఁగి
యేన కాని దీని • నెఱుఁగ రిం దొరు లని
తప్పఁ బలుక నగునె • ధార్మికులకు?

చ. విమలయశోనిధీ పురుష•వృత్తమెఱుంగుచునుండుఁజూవె వే
దములును బంచభూతములు •ధర్మువు సంధ్యలు నంతరాత్మ
యున్ | యముఁడును జంద్రసూర్యులు న•హంబును రా
త్రియు నన్మహాపదా | ర్థము లివి యుండఁగా నరుఁడు •
దక్కొన నేర్చునె తన్ను ముచ్చిలన్.

క. నాయెఱిఁగినట్ల యిన్నియు
నీయిచ్చినవరము ధారు•ణీవర యెఱుఁగున్
నాయందుఁ దొంటియట్టుల
చేయు మనుగ్రహ; మవజ్ఞ • సేయం దగునే?

క. సతియును గుణవతియుఁ బ్రజా
పతియు ననువ్రతయు నైన•వనిత నవజ్ఞా



న్వీతదృష్టిఁ జూచు నతిదు
ర్మతి కిహముం బరముఁ గలదె • మతిఁ బరికింపన్.

క. సంతతగృహమేధిఫలం
బంతయుఁ బడయంగ నోపు • ననుగుణభార్యా
వంతుం డగువాఁడు క్రియా
వంతుఁడు దాంతుండుఁ బుత్త్ర•వంతుండు నగున్.

వ. మఱియును.

సీ. ధర్మార్థకామసా•ధన కుపకరణంబు
గృహనీతివిద్యకు • గృహము విమల
చారిత్రశిక్ష కా•చార్యకం బన్వయ
స్థితికి మూలంబు స•ద్గతికి నూఁత
గౌరవంబున కేక•కారణం బున్నత
స్థిరగుణమణుల కా•కరము హృదయ
సంతోషమునకు సం•జనకంబు భార్యయ
చూవె భర్తకు నొండ్లు • గావు ప్రియము

ఆ. లెట్టిఘట్టములను • నెట్టియాపదలను
నెట్టితీఱములను • ముట్టఁబడిన
వంతలెల్లఁ బాయు •నింతులఁ బ్రజలకు
నొనరఁ జూడఁ గనిన•జనుల కెందు.

వ. మఱియు భార్య పురుషునం దర్థం బగుటం జేసి పురుషునకు మున్న పరేత యైన పతివ్రత పరలోకంబునం దన పురుషుంగూడఁ దదాగమనంబు ప్రతీక్షించుచుండుఁ; బురు

షుండు మున్న పరేతుం డైనఁ బడంబడి తానును బరేతయై తనపురుషుం గూడ నరుగు; నట్టిభార్య నవమానించుట యధర్మంబు; మఱియునుం బురుషుండు భార్యయందుఁ బ్రవేశించి గర్భంబునఁ బుత్త్రుండై తాన యుద్భవిల్లుఁ గావున 'నఙ్గాదఙ్గాత్సమ్భవసి' యను నిది యాదిగాఁ గల వేదవచనంబులయందును జనకుండును బుత్త్రుండును నను భేదంబు లేదు.

క. విను గార్హపత్య మను న
య్యనలము విహరింపఁబడి తదాహవనీయం
బన వెలుఁగునట్లు వెలుఁగును
జనకుఁడు దాఁ బుత్త్రుఁడై నిజద్యుతితోడన్.

క. తాన తననీడ నీళ్లల
లో నేర్పడఁజూచునట్లు లోకస్తుత! త
త్సూను జనకుండు సూచి మ
హానందముఁ బొందు నతిశయప్రీతి మెయిన్.

వ. "పున్నామ్నో నరకాత్త్రాయత ఇతి పుత్త్రః" యను వేదవచనంబు గలదు. కావునఁ బుణ్యాచారుం డయిన పుత్త్రుం డుభయపక్షంబుల వారి నుద్ధరించుఁ గావున.

క. నీపుణ్యతనువు వలనన
యీపుత్త్రకు డుద్భవిల్లి యెంతయు నొప్పున్
దీపంబువలన నొండొక
దీపము పుట్టించినట్లు తేజం బెసఁగన్.



మ. విపరీతప్రతిభాష లేమిటికి నుర్వీనాథ యీపుత్త్రగా!
త్త్రపరిష్వంగసుఖంబు సేకొనుము ముక్తాహారకర్పూరసాం
ద్రపరాగ ప్రసరంబుఁ జందనముఁ జంద్రజ్యోత్స్నయుం బుత్త్రగా
త్త్రపరిష్వంగమునట్లు జీవులకు హృద్యంబే కడున్ శీతమే.

క. అనఘుఁడు వంశకరుండై
వెనుకన నీసుతుఁడు వాజపేయంబులు నూ
ఱొనరించు నని సరస్వతి
వినిచె మునులు వినఁగ నాకు వినువీథి దెసన్.

క. భూరిగుణు నిట్టికులని
స్తారకు దారకు నుదార ధర్మప్రియ ని
ష్కారణమ తప్పఁజూడఁగ
సారమతీ! చనునె నాఁటి సత్యము గలుగన్.

చ. నుతజలపూరితంబు లగునూతులు నూఱిటికంటె సూనృత
వ్రత! యొకబావి మేలు మఱి బావులు నూఱిటికంటె నొక్కస
త్క్రతువది మేలు తత్క్రతుశతంబునకంటె సుతుండు మేలు త
త్సుతశతకంబుకంటె నొకసూనృతవాక్యము మేలు సూడఁగన్.

క. వెలయంగ నశ్వమేధం
బులు వేయును నొక్క సత్యమును నిరుగడలం
దుల నిడి తూఁపఁగ సత్యము
వలనన ములు సూపు గౌరవంబున పేర్మిన్.

తే. సర్వతీర్థాభిగమనంబు • సర్వవేద
సమధిగమము సత్యంబుతో • సరియుఁ గాన
యెఱుఁగు మెల్లధర్మంబుల • కెందుఁ బెద్ద
యండ్రు సత్యంబు ధర్మజ్ఞు • లైనమునులు.

క. కావున సత్యము మిక్కిలి
గా విమల ప్రీతిఁ దలఁచి • కణ్వాశ్రమసం
భావిత సమయస్థితి దయఁ
గావింపుము కొడుకుఁ జూడు • కరుణాదృష్టిన్.

క. క్షత్త్రియవరుఁడైన విశ్వా
మిత్త్రునకుఁ బవిత్ర యైన • మేనకకున్ స
త్పుత్త్రి నయి బొంకు వలుకఁగ
ధాత్త్రీతలనాథ! యింత • ధర్మేతరనే?

వ. అనిన శకుంతలపలుకులు సేకొన నొల్లక దుష్యంతుం డిట్లనియె.

క. ఏ నెట నీ వెట సుతుఁ డెట
యే నెన్నఁడు దొల్లి చూచి • యెఱుఁగను నిన్నున్
మానిను లసత్యవచనలు
నా నిట్టు లసత్యభాషణం బుచితంబే.

క. పొడుపునఁ బ్రాయంబునఁ గడుఁ
గడిఁది బలంబునను జూడఁ•గా నసదృశు నీ
కొడుకని యీతని నెంతయు
నెడమడుగుగఁ జూపఁ దెత్తె • యిందఱు నగఁగాన్.



వ. ఇట్టి లోకవిరుద్ధంబుల కేమోడుదు మయుక్తంబు లయిన పలుకులు వలుకక నీయాశ్రమంబునకుం బొమ్మనిన శకుంతల యత్యంతసంతాపితాంతఃకరణయై.

మధ్యాక్కర.

తడయక పుట్టిననాఁడ తల్లిచేఁ • దండ్రిచే విడువఁ
బడితి నిప్పుడు పతిచేతను విడువఁ•బడియెద నొక్కొ
నుడువులు వేయు నింకేల యిప్పాటి • నోములు దొల్లి
కడఁగి నోఁచితిని గా కేమి యనుచును • గందె డెందమున.

వ. ఇట్లు దద్దయు దుఃఖించి విగతాశయై బోఁగనఁ దొరఁగు బాష్పజలంబు లందంద యొత్తికొనుచు నింక దైవంబ కాని యొండుశరణంబు లేదని యప్పరమపతివ్రత తనయుం దోడ్కొని క్రమ్మఱి పోవనున్న యవసరంబున.

చ. గొనకొని వీఁడు నీకును శకుంతలకుం బ్రియనందనుండు సే
కొని భరియింపు మీతని శకుంతల సత్యమువల్కెఁ సాధ్వి స
ద్వినుత మహాపతివ్రత వివేకముతో నని దివ్యవాణి దా
వినిచె ధరాధినాథునకు • విస్మయ మందఁగఁ దత్సభాసదుల్.

వ. ఇట్లెల్లవారలకు నతిహర్షంబుగా శకుంతల పతివ్రతాత్వంబును సత్యంబును భరతోత్పత్తియుఁ బ్రశంసించు వేలుపులపలుకు లతివ్యక్తంబు లయి యాకాశంబువలన వీతెంచిన విని దుష్యంతుండు సభాసదులు విన నిట్లనియె.

తే. ఏను నీయింతియును గాని • యెఱుఁగ రన్య
లర్థిఁ గణ్వమహాముని • యాశ్రమంబు

నందు గాంధర్వవిధి వివాహమునఁ గరము
నెమ్మిఁ జేసితి దీనిఁ బాణిగ్రహణము.

తే. అన్యు లెఱుఁగమిఁజేసి లోకాపవాద
భీతి నెఱిఁగియు నిత్తన్విఁ బ్రీతి దప్పి
యెఱుఁగ నంటిని నిందఱ కిప్పుడెఱుఁగఁ
జెప్పె నాకాశవాణి యచ్చెరువుగాఁగ.

వ. అని మహానురాగంబునం గొడుకు నెత్తికొని హర్షపులక లెసఁగ నాలింగనంబుసేసి శకుంతలామహాదేవి నతి ప్రణయగౌరవంబున సంభావించి యౌవరాజ్యంబునకు భరతు నభిషిక్తుం జేసి పెద్దకాలంబు రాజ్యసుఖంబు లనుభవించి తన రాజ్యభారం బంతయు భరతుం బూన్చి దుష్యంతుండు దపోవనంబున కరిగిన.

చ. భరతుఁ డశేష భూభువనభారధురంధరుఁ డై వసుంధరం
బరఁగి యనేక యాగములఁ బాయక భాస్కరజహ్ను
కన్యకా। సురుచిరతీరదేశముల సువ్రతుఁ డై యొనరించి
భూరి భూసురులకు నిచ్చె దక్షిణలు శుద్ధసువర్ణ గవా
శ్వ హస్తులన్.





—* శిశుపాలవధ. *—

క. ప్రాజ్ఞుఁడు విశేషధర్మ వి
ధిజ్ఞుఁడు ధర్మజ్ఞుఁడు యజ్ఞదీక్షితుఁ డయి వి
ప్రజ్ఞాతి పరివృతుం డయి
యజ్ఞాయతనమున కరిగె నధిక విభూతిన్.

ఉ. సమ్మదమంది చూచిరి భృశంబుగ భూజను లెల్ల బ్రహ్మ తే
జమ్మును రాజతేజమును సద్భుజ భూషణరత్న రాజి తే
జమ్మును విస్తరించుచు నిజద్యుతి యొప్పఁగ మూర్తమైన ధ
ర్మమ్ము నుబోలె నున్న గుణమండితు దీక్షితు ధర్మనందనున్.

క. బ్రహ్మవిదు లయిన నిఖిల
బ్రాహ్మణసత్తములచేతఁ బరివేష్టితుఁ డై
బ్రహ్మణ్యుఁ డొప్పెఁ గురుపతి
బ్రహ్మర్షిపరీతుఁ డయిన బ్రహ్మయ పోలెన్.

క. వేదనినాదము నాశీ
ర్వాద నినాదము ననేక వాదిత్రమహా
నాదంబుఁ జెలఁగె నన్యని
నాదంబు జనంబులకు వినంబడకుండన్.

వ. అంత ననంత వేదమూర్తు లైన పైల ధౌమ్యులు హోతలుగా యాజ్ఞవల్క్యుం డధ్వర్యుండుగా ద్వైపాయ నుండు బ్రహ్మగా సుసాముం డుద్గాతగా, వీరల పుత్రశిష్య గణంబులు క్రమంబున మైత్రావరుణుండును నచ్ఛావాకుం డును గ్రావస్తుతుండును బ్రతిప్రస్థాతయు నేష్టయు నున్నే

తయు బ్రాహ్మణాచ్ఛంసియు నాగ్నీధ్రుండును బోతయుఁ బ్రస్తోతయుఁ బ్రతిహర్తయు సుబ్రహ్మణ్యుండునుగా నారదాది బ్రహ్మర్షులు సదస్యులుగా భీష్మాది రాజర్షులు సహాయులుగా సర్వక్రియాసమగ్రంబయి షడంగ సమృద్ధంబయి సంపూర్ణ దక్షిణా సనాథంబయి సకలధనధాన్య సమన్వితంబయి జగన్నాథరక్షితంబయి సకల జనానందకరంబయి రాజసూయం బతి రమణీయం బయ్యె.

క. శాంతనవుఁడు భీష్ముండు ప్ర
శాంతుఁడు దత్క్రతువు సూచి ♦ సంతుష్టుండై
యంతకతనూజునకు ధృతి
మంతున కత్యంత ధర్మ♦మతి కిట్లనియెన్.

మత్తకోకిలము.

స్నాతకుండును ఋత్విజుండును ♦ సద్గురుండును నిష్టుఁడున్
భూతలేశుఁడు సంయుజుండును ♦ బూజనీయులు వీరిలోఁ
బ్రీతి నెవ్వఁడు సద్గుణంబులఁ ♦ బెద్ద యట్టిమహాత్ము వి
ఖ్యాతుఁ బూజితుఁ జేయు మొక్కనిఁ♦ గౌరవాన్వయవర్ధనా.

వ. అనిన నట్టివాఁ డెవ్వండు నాకెఱింగింపు మనిన ధర్మరాజునకు భీష్ముం డిట్లనియె.

సీ. రోదసీకుహరంబు ♦ రుచిరాంశుతతిఁ జేసి
యర్కుఁడు వెలిఁగించు ♦ నట్టు లమృత
సందోహనిష్యంద♦ చంద్రికఁ జేసి శీ
తాంశుఁ డానందించు ♦ నట్లు సకల



జనులకుఁ దనదైన ♦ సదమలద్యుతిఁ జేసి
తనరంగఁ దేజంబుఁ ♦ దనుపుఁ దాన
చేయుచునున్న స♦త్సేవ్యుండు పుండరీ
కాక్షుండు గృష్ణుఁడ ♦ నాదినిధనుఁ

ఆ. డబ్జనాభుఁ డుండ ♦ నర్ఘ్యంబునకు నిందు
నర్హు లొరులు గలరె ♦ యజ్ఞపురుషు
నఖిలలోకపూజ్యు ♦ నచ్యుతుఁ బూజింపు
మధిప! యదియచూవె ♦ యజ్ఞఫలము.

వ. అనిన భీష్మువచనంబున నప్పుడు సహదేవోపనీతం బయిన యర్ఘ్యం బర్హణీయుండయిన వాసుదేవునకు శాస్త్రదృష్టవిధానంబున ధర్మతనయుం డిచ్చినదానిం జూచి సహింపక శిశుపాలుం డుపాలంభనపరుండయి యధోక్షజు నాక్షేపించుచు ధర్మరాజున కిట్లనియె.

మ. అవనీనాథు లనేకు లుండఁగ విశి♦ష్టారాధ్యులార్యుల్ మహీ
దివిజుల్ పూజ్యులు పల్వురుండఁగ ధరి♦త్రీనాథ! గాంగేయుదు
ర్వ్యవసాయంబునఁ గృష్ణుఁ గష్టచరితున్ ♦ వార్ష్ణేయుఁ బూజించి నీ
యవివేకం బెఱిఁగించి తిందఱకు దా♦శార్హుండు పూజార్హుఁడే?

చ. కడుకొని ధర్మతత్త్వ మెఱుఁ♦గంగ నశక్యము ధర్మబాహ్యు ని
న్నొడఁబడ నిష్టుఁడై కఱపి ♦ యుత్తములుండఁగ వాసుదేవుఁడ
జ్ఞునకుఁ బూజయిమ్మని ని♦చారవిదూరుఁడు భీష్ముఁ డెంతయున్
వెడఁగు జనంబునం బనిచె ♦ వృద్ధులబుద్ధులు సంచలింపవే?

చ. ఇతనికిఁ గూర్తురేని ధన•మిత్తు రభీష్టము లైనకార్యముల్
మతినొనరింతు రిష్టుఁడని • మంతురు గాక మహాత్ములైనభూ
పతులయు విప్రముఖ్యుల స•భన్ విధిదృష్టవిశిష్టపూజనా
యతికి ననర్హు నర్హుఁడని•యచ్యుతు నర్చితుఁ జేయఁ బాడియే?

సీ. ఈతని వృద్ధని • యెఱిఁగి పూజించితే
వసుదేవుఁ డుండంగ • వసుమతీశ!
ఋత్విజుం డని విచా•రించి పూజించితే
ద్వైపాయనుం డుండ • ధర్మయుక్తి
నాచార్యుఁ డని విన•యమున బూజించితే
కృతమతుల్ ద్రోణుండుఁ • గృపుఁడు నుండ
భూనాథుఁ డని యెడు • బుద్ధి బూజించితే
యాదవుల్ రాజులే • యనవిమీఁదఁ

ఆ. బూజనీయులైన • పురుషులలోపల
నెవ్వఁడయ్యెఁ గృష్ణుఁ • డిట్టులేల
పూజ్యులయినవారిఁ • బూజింపనొల్లక
భీష్ము పలుకుఁ జేసి • బేలవయితి?

చ. పురుషవిశేషవిత్తముఁడు • పూజ్యుఁడు రాజులలోన నీయుధి
ష్ఠిరుఁడని నీగుణాళి ప్రక•టించి మనంబులలోన ధారుణీ
శ్వరులు భవన్ముఖంబునకు • వచ్చిన నిందలు కివ్విధంబునం
బరఁగ నవజ్ఞ సేయు టిది • పాడియె ధర్మువె ధర్మనందనా!

క. నీవెఱుఁగక యిచ్చిన నిది
నావిషయమె యని మనంబు•నం దలపక ల



జ్జావిరహితుఁ డయి యర్ఘ్యము
గోవిందుఁడు గొనియెఁ దనకుఁ • గొను టుచితంబే?

క. చనఁ బేడికి దారక్రియ
యును జెవిటికి మధురగీతి•యును జీకున క
త్యనుపమ సురూపదర్శన
మును జేయుటఁ బోలుఁ గృష్ణు • బూజించు టిలన్.

ఉ. ఈయవనీశ్వరప్రవరు • లిందఱు నిన్ను నగంగ నిట్లుగా
జేయుదె ధర్మరాజను వి•శేషసమాఖ్య నిరర్థకంబుగా
ధీయుత! యంచు ధర్మజ న•దీసుత కృష్ణుల నెగ్గులాడుచుం
బో యెసదంబు వెల్వడిస•పుత్త్రిబలుండయి చైద్యుఁడుల్కతోన్.

వ. ఆ శిశుపాలుపిఱుందన చని ధర్మనందనుండు వానిం బ్రియవచనంబుల ననునయించుచు నిట్లనియె.

క. భూరిగుణోన్నతు లనఁ గను
వారికి ధీనులకు ధరణి•వల్లభులకు వా
క్పారుష్యము చన్నె? మహా
దారుణ మది విషముకంటె • దహనముకంటెన్.

చ. ఆదిజుఁ డైనబ్రహ్మయుద•యంబున కాస్పద మైనవాఁడు వే
దాదిసమస్తవాఙ్మయము•లందుఁ బ్రశంసితుఁ డైనవాఁడు లో
కాది త్రిలోకపూజ్యుఁ డని • యాత్మ నెఱింగి పితామ
హుండు దా! మోదరుఁ జెప్పెఁ బూజ్యుఁ డని • యుక్త
మ కాకిది యేమి దోసమే?

క. పరమార్థప్రతిభం దమో
హరు నచ్యుతు భీష్ముఁ డెఱిఁగి • నట్లెఱుఁగంగ నీ
కరిది శిశుపాల! పెద్దల
చరితం బల్పులకు నెఱుఁగ • శక్యమె యెందున్.

క. గురుఁడని సమస్తలోకో
త్తరుఁడని నీకంటె వృద్ధతములైన నరే
శ్వరు లచ్యుతునర్చన నెడఁ
గర మభినందింప నీకుఁ • గాదనఁ దగునే?

వ. అని యాశిశుపాలుం బట్టుపఱుచుచున్న ధర్మరాజునకు భీష్ముం డిట్లనియె.

ఉ. పాలితదుర్నయుండు శిశుపాలుఁడు బాలుఁడు వీని నేల
భూ । పాలక! నీకుఁ బట్టువఱుపన్ మఱి ధర్మ వెఱుంగ
వీనికిం । బోలునె రాగకోప పరిభూతమనస్కున కల్ప
రాజ్యల।క్ష్మీలల నాంధబుద్ధి కని•మిత్త మహాత్మపరివాద
శీలికిన్.

వ. అని ధర్మరాజును వారించి శిశుపాలుం జూచి భీష్ముం డిట్లనియె.

చ. అవినయబుద్ధివై హరికి • నర్ఘ్య మయోగ్యమ యంటి వీవు
మూ । ర్ఖవు శిశుపాల! యింకఁ బలుకన్ వలసెన్ సభ
లోన నున్న యీ । యవనిపు లెల్ల నాతనిద•యం బరి
ముక్తులు వానిచేత నాహవజితులుం దదీయశరణార్థు
లుఁ గాకొరులయ్య చెప్పుమా.



తే. ఉత్తమజ్ఞానవృద్ధు నా • నుండెనేని
బాలుఁ డయ్యును బూజ్యుండు • బ్రాహ్మణుండు
క్షత్త్రియుఁడు పూజ్యుఁ డమితవిక్రమ సమృద్ధి
నుర్విపతులలో నధికుఁడై • యుండెనేని.

క. ఈరెండు కారణముల ము
రారాతియ యర్ఘ్యమునకు • నర్హుఁడు జగదా
ధారుండు మాక కాదు స
దారాధ్యుఁడు విష్టపత్ర • యావాసులకున్.

క. వృద్ధు లొకలక్ష యున్నను
బుద్ధియె యెవ్వరికి వారిఁ • బూజింపంగా
నిద్ధరణీశులలో గుణ
వృద్ధని పూజించితిమి త్రి•విక్రము భక్తిన్.

క. పూజితుల తృప్తు లగుదురు
భూజను లొరు లచ్యుతుండు • పూజితుఁ డగుడుం
దేజమున జగత్త్రితయముఁ
బూజితమయి తృప్తిఁ బొందుఁ • బుణ్యసమృద్ధిన్.

సీ. బుద్ధియు మనమును • బురుషుండు నవ్యక్త
మగుచున్న ప్రకృతియు • నంబరంబు
ధరణియుఁ దరణియు • దహనుండుఁ జంద్రుండు
గాడ్పును దిక్కులుఁ • గాలములును
దానయై జంగమ • స్థావరాత్మక మైన
సకలభూత ప్రపం•చంబు నెల్లఁ

దనదివ్యశక్తిమైఁ ◆ దాల్చిన సర్వాత్మ
సర్వభూతేశ్వరు ◆ సర్వవంద్యు

ఆ. నధికయోగనిష్ఠి◆తాత్మకులగు మహా
యోగివరులు తత్త్వ◆యుక్తిఁ జేసి
యెఱిఁగినట్టు నీకు ◆ నెఱుఁగంగఁ బోలునే
యనుచు భీష్ముఁ డన్న ◆ యవసరమున.

చ. ఎడపక యర్ఘ్య మచ్యుతున◆ కిచ్చితి మిచ్చిన దీనికిం దొడం
బడ మని దుర్జనత్వమునఁ ◆ బల్కెడువీరుల మస్తకంబుపై
నిడియెద నంచుఁ దాఁ జరణ◆ మెత్తె సభన్ సహదేవుఁ డట్టిచో
నుడిగి సభాసదుల్ వలుక ◆ కుండిరి తద్దయు భీతచిత్తులై.

చ. చెలువుగఁ బుష్పవృష్టి గురి◆సెన్ సహదేవుపయిన్ దివంబు
నన్। వెలయఁగ సాధువాదములు ◆ వించె సభాసదులెల్ల
విస్మయా। కులితమనస్కులైరి తన ◆ కుంచెయుఁ గృష్ణమృ
గాజినంబునుం। బలుమఱు వీచుచుం గలహ◆బంధుఁడు
నారదుఁ డాడె వేడుకన్.

వ. అంత శిశుపాలుసేనాపతి సునీథుం డనువాఁ డతిరోషపరుష వచనుండగుచు నృపక్షత్త్రియుల నెల్ల నొక్కంతం జేర్చికొని శిశుపాలు ననుమతంబున యుద్ధసన్నద్ధుం డయి యున్నసమయంబున.

చ. రయవిచలత్తురంగమ త◆రంగములన్ మదనాగనక్రసం
చయముల సంచలచ్ఛటుల ◆ సైనికమత్స్యములన్ భయం
కర। బయి యదువృష్ణి భోజ కుకు◆రాంధక వాహిని



యుం గలంగె ని। ర్దయతర రోషమారుత ని◆తాంత సమీ
రితమై క్షణంబునన్.

వ. అట్టి సకలక్షత్త్రియక్షోభంబు సూచి భయసంభ్రమాక్రాంతహృదయుం డై ధర్మరాజు భీష్మున కిట్లనియె.

తరలము॥ ధరణిలోఁ గలరాజులెల్లను ◆ దారుణక్షయకాలసా
గరములట్లు గలంగి రిపు మ◆ఖప్రయోగము విఘ్నముం
బొరయకుండఁ బ్రజాపకారము ◆ పుట్టకుండఁగ నీవు చె
చ్చెరఁ బితామహ! వీరి కిచ్చుటఁ ◆ జిత్తశాంతి యొనర్పవే.

వ. అనిన ధర్మరాజునకు భీష్ముం డిట్లనియె.

క. నీయజ్ఞమునకు విఘ్నము
సేయఁగ నోపుదురె యొరులు ◆ జితదైత్యుఁడు నా
రాయణుఁడు యజ్ఞపురుషుఁ డ
జేయపరాక్రముఁడు దీనిఁ ◆ జేకొని కావన్.

సీ. చైద్యునకై పూని ◆ సన్నద్ధులైయున్న
యీరాజులిందఱు ◆ నీక్షణంబ
హరి యల్గి చూచుడు ◆ నంతకక్షయమున
కరిగెడువార ఘో◆రాహవమున
దమఘోషనందను ◆ దర్పంబు నిప్పుడ
యడఁగెడుఁ గడుఁ జెక్కు◆లయ్యెఁ గుక్క
లిభకుంభదళన మ◆హిష్ఠనిష్ఠుర నఖ
ముఖుఁ డగు హరిమీఁద ◆ మొఱఁగి యేమి

ఆ. సేయ నోపుఁ గృష్ణు • సింహపరాక్రము
నెఱుఁగకున్నవారె • యెల్లవారు
ననిన భీష్ముపలుకు • లవి కర్ణశూలంబు
లయినఁ జేదినాథుఁ • డాగ్రహించి.

ఉ. ఇమ్మ్రది వెఱ్ఱి వీనిఁ బర•మేశ్వరుఁగాఁ గొనియాడె ధర్మత
త్త్వమ్ములు పాండవేయులును • దాసును గాక యెఱుంగ
రట్టె సా।మమ్మున నెల్లవారి నవ • మాన్యులఁ జేసె నమా
న్యుఁ డంచు రూ।క్షమ్మున భీష్ముఁ జూచి బల • గర్వితుఁ
డిట్లని పల్కె నల్కతోన్.

ఉ. నెట్టన ధర్మనందనుఁడు ని • న్నవలంబము సేసి యొడతో
గట్టినయొడవోలెఁ గత•గౌరవుఁడై కడుదూలెఁ గృష్ణుఁజే
పట్టి బిభీషికల్ ధరణి•పాలుర కిప్పుడు సూపి తెందు నీ
యట్టిదురాత్ములుంగలరె • యంతయధీరులె ధారుణీపతుల్?

సీ. పూతనాఘాతంబుఁ • జేతనేతరమైన
శకటంబుత్రోపును • జరణనిహతి
వీకతోఁ గడుఁ బూఁచు • మ్రాఁకులఁగూలుపును
వల్మీకమాత్రప•ర్వతము నెత్తి
కొని లావు గలఁడు వీఁ • డన నేఁడుదివసంబు
లునికియు వృషవధ•యును సనంగఁ
బమ్మినకృష్ణుబీ•రమ్ములు వొగడుచు
నున్న నీనాలుక • యొక్కఁ డయ్యె



ఆ. వ్రియ్యవలయు నూఱు•వ్రియ్యలుగాఁగ న
ట్లయినఁ గాని చాల • వతనిఁ బొగడ
నెల్లదాని నేన•యెఱుఁగుదు నెందు వాఁ
డర్ఘ్యదానయోగ్యుఁ డయ్యె • జెపుమ.

వ. స్త్రీలను గోబ్రాహ్మణులం గూడు పెట్టువారిని విశ్వసించినవారిని వధియించుట మహాపాతకం బని పెద్దలు సెప్పుదు రట్టియందు గోవిందుండు స్త్రీవధయును గోవధయు నుం జేసె; నీవునుం గడు ధర్మ వెఱింగినవాఁడవయి వీని కర్ఘ్యం బిప్పించి, తదియునుంగాక యన్యకామిని యయిన యంబ యను కన్యక నపహరించి నీవు దెచ్చిన నెఱింగి నీతమ్ముఁడు విచిత్రవీర్యుండు ధర్మ వెఱింగినవాఁడై దాని విడిచిపుచ్చె.

క. జననిందిత మయి నీయం
దనపత్యత యను నధర్మ • మది యుండఁగ ధ
ర్మనివృత్తచరిత్రిక నీ
యనుశాసన మెట్లు నమ్మ•నగు జనములకున్.

వ. తొల్లి సముద్రతీరంబున నుండి యొక్క వృద్ధహంస ధర్మాధర్మంబులు సెప్పుచు ధర్మమార్గంబున వర్తిల్లుచుండుఁ డని పక్షుల నెల్ల శిక్షించుచుఁ బ్రాణిహింస సేయక తపోవృత్తినున్న దానికి సముద్రజలచరంబు లయినపక్షులు రుచ్యంబు లగుభక్ష్యంబులు దెచ్చి పెట్టుచుం దత్సమీపంబునం దమతమయండంబులనెల్ల నిక్షేపించి భక్షణార్థం బొక్కనాఁ డలిదూరం బరిగిన నిట యాహంసయు నయ్యండంబుల భక్షిం

చిన దాని నొక్కపక్షి గని యాపక్షుల కెల్లం జెప్పిన నవి దద్దయు దుఃఖించి యాయంచను వధియించెం గావున నట్ల నీవు నధర్మప్రవృత్తుండ వై ధర్మశిక్ష సేయుచుఁ గౌరవుల కాపద యాపాదించుచున్నవాఁడవు.

క. విదితముగ నధికబలసం
పద నోర్చె నుపేంద్రుఁ డవని • పాలుర నంచున్
మదిఁ బొగడితి నాయెలుఁగని
యదియె జనార్దనుబలంబు • నత్యున్నతియున్.

క. సకలక్షత్త్రభయంకరు
నకు బార్హద్రథికి నని మొనన్ మార్కొన నో
పక వలియం బాఱఁడె యీ
ముకుందుఁడు భయాతిరేక • మునఁ బదిమాఱుల్.

వ. అమ్మహాసత్త్వు జరాసంధుం బరమబ్రహ్మణ్యు బ్రాహ్మణవేషంబున భీమార్జునులం దోడు సేసికొని వధియించె; నవి యెల్లం ద్రివిక్రమపరాక్రమంబులుగా నశ్రాంతవదనుండ వయి.

ఆ. బూతు వొగడినట్లు • వొగడెదు పొగడంగ
వలయునేని సుగుణ • వంతు లయిన
కర్ణశల్యు లాది • గాఁ గలవీరులఁ
బొగడుచుండ రాదె • ప్రొద్దువోక.

ఆ. అన్యకీర్తనంబు • నన్యనిందయుఁ దన్నుఁ
బరఁగఁ బొగడికోలుఁ • బ్రిచ్చికోలు



నాపగాతనూజ! • యార్యవృత్తములు గా
వసిరి వీని నాద్యు • లయిన మునులు.

వ. అని రూక్షాక్షరవచనంబుల నాక్షేపించుచున్న శిశుపాలుం జూచి సహింపనోపక భీమసేనుం డతిరౌద్రాకారంబున నలిగిన.

చ. ప్రకటితకోపవేగమునఁ • బద్మదళాయతనేత్రముల్ భయా
నకతరలీలఁ దాల్చె నరు • ణద్యుతి నుద్యతమై త్రిశాఖ మై
భ్రుకుటిలలాటదేశమునఁ • బొల్చెఁ ద్రికూటతటిత్త్రిమార్గగా
నుకృతిఁ బ్రభంజనప్రియత • నూజున కంతకమూర్తికచ్చటన్.

వ. ఇట్లు నిఖిలక్షత్త్రమాత్రనజనంబుగా నలిగి దంతసందష్టదారుణముఖుండై శిశుపాలనిర్మూలనాభీలసంరంభంబున నున్న భీమసేను వారించి భీష్ముం డిట్లని చెప్పె; నిద్దురాత్ముండు తొల్లి చేదివంశంబున దమఘోషుం డనువానికి సాత్వతకిం జతుర్భుజలలాటనేత్రంబులతో నుదయించి రాసభరవంబున నేడ్చుచున్నం జూచి తల్లిదండ్రు లుభయ విస్మయాధీనమనస్కు లయి యున్నవారికి నొక్క యశరీరభూతం బిట్లనియె.

ఆ. వీని నొరులు నొంపఁ • గా నోప రెవ్వరు
నెవ్వరేని వీని • నెత్తికొనుడు
మిగిలియున్న బాహు • యుగళంబుఁ గన్నును
నడఁగు వీని కతఁడ • యంతకుండు.

వ. అనిన నయ్యశరీరివచనంబులు విని వార లాశ్చర్యమానసు లయి యాకుమారుం జూడవచ్చినవారిచేతి కెల్ల నెత్తికొన నిచ్చుచున్నంత.

చ. అతివికృతస్వరూపధరుఁ డైన కుమారకుఁ బ్రీతితోడ
సాత్వతిఁ దనమేనయత్తను ముదంబునఁ జూడఁగఁ గోరి యద్భుత
ప్రతిములు రామకేశవులు పన్నుగ నేఁగిరి చేదిధారుణీ
పతిపురి కొక్కనాఁ డఖిల బాంధవమంత్రిసుహృత్సమేతులై.

వ. ఇట్లు వచ్చిన రామకేశవులం బ్రియసత్కారంబులఁ బూజించి సాత్వతియు నబ్బాలు బలదేవుచేతికి నెత్తికొన నిచ్చి తదనంతరంబ నారాయణుచేతికి నిచ్చిన.

క. అక్కొడుకు నబ్జనాభుం
డక్కజముగ నెత్తికొనుడు నందఱుఁ జూడన్
గ్రిక్కున నొక్కట నడఁగెను
మిక్కిలిచేతులును వాని మిక్కిలికన్నున్.

వ. దానిం జూచి సాత్వతి యద్భుతచిత్తయై యశరీరి పలుకు లప్పుడు దలంచి తన పుత్త్రునకు మురవైరివలన మరణం బగుట యెఱింగి యతని కిట్లనియె.

క. కుపథప్రవృత్తుఁ డయి వీఁ
డపనయమున నీ కనిష్టుఁ డయినను గరుణా
నిపుణుఁడ వై నీమఱఁదికి
నపరాధశతంబు సైఁపు మయ్య యుపేంద్రా!

వ. అని పినతల్లి తొల్లి జగద్వల్లభుం డైన జనార్దనుం బ్రార్థించి తత్ప్రసాదంబు వడయుటం జేసి శతాపరాధంబులు నిండునంతకు వీఁ డన్యులచేత నప్రతిహతుండు గృష్ణునిచేత నిహతుం డగు, నది కారణంబుగా.



చ. ఇతనికి నిట్లు నన్ను నక యోగ్యులు వల్కఁగఁ బోలెఁ గాక యు
ద్ధతమతి నన్ను లీల నవిధంబునఁ బల్కి మదీయచాప ని
ర్గతచటులోగ్రమార్గణనికాయపయోధి మునుంగ కిట్లు ద
ర్పితులయి పోవనేర్తురె గభీరపరాక్రమ! మారుతాత్మజా!

వ. అని పలుకుచున్న భీష్మభీముల నతిక్రమించి శిశుపాలుండు జనార్దనున కభిముఖుం డయి యిట్లనియె.

మ. అవమాన్యున్ సభలోన మాన్యుఁ డని సౌహార్దంబునం గౌరవ
స్థవిరప్రేరణ నిన్నుఁ బాండుతనయుల్ తప్పంగ బూజించి రా
య్యవివేకాస్పదు లైన పాండవులు మోహాంధుండు భీ
ష్ముండుఁ గేశవ! నీవుం గడుఁగుఁడు నాకు నెదురై సంగ్రా
మరంగంబునన్.!

వ. అని శిశుపాలుండు గర్వించి పలికిన విని చక్రధరుం డఖిలరాజచక్రంబు విన నిట్లనియె.

సీ. ప్రాగ్జ్యోతిషంబున భగదత్తుపయి నేము
వోయిన నీతఁ డన్యాయవృత్తి
నిట బాలవృద్ధుల కెల్ల భయంబుగా
ద్వారకాపురిఁ గాల్చె వీరు లైన
భోజరాజన్యులు పొలఁతులతోడ రై
వతకాద్రిఁ గ్రీడాభిరతిఁ బ్రమత్తు
లయి యున్న వారల నదయుఁడై వధియించె
దేవాభుఁ డగు వసుదేవుచేయు
ఆ. నశ్వమేధమునకు నభ్యర్చితం బైన
హయము నపహరించి యజ్ఞమునకు

విఘ్న మాచరించె • వీఁ డతిపాపుఁడై
బభ్రుభార్యఁ దనకు • భార్యఁ జేసె.

వ. మఱియు వాగ్విషయంబు లయిన యపకారంబు లనేకంబులు సేసె; మాయత్తసాత్వతి నన్నుం బ్రార్థించుటం జేసి యిద్దురాత్ముండు సేసినయపరాధశతంబు సహించితి; నిప్పుడు మీరిందఱు నెఱుంగ నాయం దకారణవ్యతిక్రమం బుపక్రమించి యత్యంతశత్రుం డయ్యె ననిన విని శిశుపాలుం డతిపరుషవచనుండగుచుఁ బురుషోత్తమున కిట్లనియె.

క. నీకూర్మియు నీయలుకయు
నాకవి యేమిటికి దుర్గుణప్రియ! మొదలన్
నాకిచ్చిన యక్కన్యకఁ
జేకొని నీకిట్లు వలుక • సిగ్గును లేదే ?

చ. అని శిశుపాలుఁ డొండొకట • నప్రియముల్ హరిఁ బల్కు
చున్నచోఁ ననలశిఖాలిదూలదను • జాంతకచక్రము రాజచక్రమె
ల్లను భయమంద మూర్ధవిక • లంబుగ నప్పుడు సేసె జేదిసం
దనుతనువున్ బృహద్రుధిర • ధారలు బోరన మీఁది కొల్కఁగాన్.

ఉ. ప్రల్లదమేది యిట్లు శిశు • పాలుఁడు వజ్రహతాద్రితుల్యుఁడై
త్రెళ్ళుడు వాని దైనపృథు • దేహము వెల్వడి తేజ మంబరం
బెల్ల వెలుంగ వచ్చి పర • మేశ్వరుదేహము సొచ్చె విస్మయో
త్ఫుల్లవిశాలనేత్రులయి • భూపతులెల్లను జూచుచుండగాన్

క. ఘనజాలము లేకయుఁ బెలు
చన పిడుగులతోడి వృష్టి • చైద్యునిపాతం



బునఁ గురిసె సముద్రమహా
ద్రినికాయముతో ధరిత్రి • దిర్దిరఁ దిరిగెన్.

క. జయజయనినాదమున న
వ్యయు నంబుజనాభు భువన • వంద్యు నుపేంద్రుం
బ్రియమునఁ బొగడు జనంబుల
దయిన మహాధ్వనియుఁ జెలఁగె • నతితుములంబై.

—• గురుదక్షిణ •—

వ. అంతఁ బ్రభాతసమయంబ ద్రోణాచార్యుండు శిష్యులనెల్ల రావించి నాకు గురుదక్షిణ యిం డనిన నందఱు మ్రొక్కి యెదుర నిలిచి మీ కెద్ది యిష్టంబు సెప్పుండనిన విని యవివేక కారణ దారుణైశ్వర్యావలిప్తుండైన ద్రుపదు నోడిచి పట్టి తెం డిదియు నాకు గురుదక్షిణ యని పంచిన.

క. వల్లెయని రాజనందను
లెల్లను సమకట్టి రథము • లెక్కి దిశల్ భే
దిల్లఁగ గర్జిల్లి నిశా
తోల్లసిత కృపాణకార్ముకోద్యతకరులై.

ఉత్సా. ఏల దీని నెడయఁ జేయ • నీక్షణంబ యేగి పాం
చాలుఁ బట్టి తెత్త మధిక • శౌర్యలీల మెఱయఁగాఁ
బోలుననుచుఁ బెరిఁగి రాజ • పుత్త్రు లరిగి యార్చి పాం
చాలుపురము ముట్టికొని ర • సంఖ్యబలసమేతులై.

వ. పాండవులును రథంబులెక్కి ద్రోణుం బరివేష్టించి పిఱుంద నరిగి రంత నర్జునుం డాచార్యున కిట్లనియె.

క. వడిగొని కౌరవు లొండొరుఁ
గడవఁగ మును చనిరి వారి • గర్వము సూడం
గడిమిని ద్రుపదాధిపుతోఁ
బొడువఁగఁ దమకలవియగునె • భుజవీర్యమునన్.

క. అతఁగులచే ద్రుపదుఁ డనవ
హితుఁడై పట్టువడ నంత • హీనుఁడె శౌర్యో
న్నతుఁ డధికధనుర్విద్యా
న్వితుఁడు భవత్సఖుఁ డనంగ • వినరొకో వానిన్.

వ. అనుచుఁ బాంచాలపురం బాసన్నంబుగాఁ జనుదెంచునంతకు ముందఱ చని దుర్యోధన యుయుత్సు దుశ్శాసన వికర్ణ జలసంధాదులైన ధార్తరాష్ట్రు లనేక నృపకుమారసహితులై పాంచాలుపురం బవరోధించినఁ బాంచాలపతి యలిగి యపార చతురంగబలసమేతుండై కౌరవులఁ దాఁకి.

క. శరనికరసహస్రంబులఁ
బఱవడి నందఱను గప్పెఁ • బ్రావృడ్ధారా
ధర ముదధారాజలముల
సరసిజములఁ గప్పునట్లు • సంరంభమునన్.

క. కలయ ననిముసలదండం
బులుగొని కాంపిల్యనగర•మున జనులెల్లన్
నలిరేఁగి యార్చి కౌరవ
బలసుభటులఁ బొడిచి రాజి • బడలువడంగన్.

క. ధృతరాష్ట్రకుమారులు నవ
హితులై పాంచాలుమీఁద • నేసిరి సాంద్ర



తతబాణప్రకర తిరో
హితమై రవికిరణజాల • మేర్పడకుండన్.

క. వారలశరములు నడుమన
వారించుచు నధికలాఘ•వంబున వారిన్
ఘోరశరవిద్ధమర్ములఁ
గారణమున సోమకుండు • ఘనుడై యేసెన్.

క. నానావిధమార్గణముల
నానామార్గముల నేసి•రం గురువీరుల్
వానింజూచి భయంపడి
నానాతనుఁగా మనంబు•నన్ వగచి రనిన్.

వ. ఇట్లు పాంచాలుబాణవృష్టికి నిలుపోపక కురుకుమారులు కుమారశరనిహత సురారికుమారులుంబోలె వెఱచఱచి పాండవులయొద్దకుం బఱతెంచినం జూచి యర్జునుం డాచార్యధర్మజులకు నమస్కరించి మీరలింద యుండుం డే నీక్షణంబ యప్పాంచాలుంబట్టి తెచ్చెదనని విజృంభించి సంరంభంబున భీమసేనుండు దనకు సేనాగ్రచరుండుగా మాద్రేయులు రథచక్రరక్షకులుగా ద్రుపదరాజవాహినీసముద్రంబు చఱియం జొచ్చిన.

క. కరిఘటలఁ దాఁకి భీముఁడు
గరటతటీకుంభ బింబ • కరముఖముల జ
ర్జరితములఁ జేసె నిష్ఠుర
తర వజ్రనిపాతపటుగ•దాఘాతములన్.

ఉ. దారుణమా వృకోదరు గ♦దాకులిశాహతి నన్యవాహినీ
వారణసంచయం బభిన♦వక్షత జారుణధార లొప్ప సం
చారితధాతునిర్ఝర వి♦శాలశిలోచ్చయ సంచయాభమై
వీరరణంబునం బడియె ♦ విక్షతహస్తిప వృక్షపంక్తితోన్

చ. అనిలజుఁ డుగ్రుఁడై ద్రుపదు ♦ హస్తిఘటావళి నశ్వసం
హతిన్ | ఘనరథకోటి భగ్నములు♦గా సమరంబునఁ జేసి
పేదదుర్మనుజులఁ జంపనేల యని ♦ మానుగ గోప్రుఁడు
గోగణంబులన్ | గొనకొని రొప్పునట్టు లధి♦కుం డెగిచెం
బృథుదండహస్తుఁడై.

స్రగ్ధ. అంతం గౌంతేయుఁ డత్యా♦యత యశుఁడు నరుం డగ్గి
పాంచాలు దంతి | ధ్వాంతంబున్ వాని వాహో♦త్తమతుహి
నతతిం ♦ దద్భటోదారతారా | సంతానంబున్ శరాంశూ ♦
చ్చయవిభవమునన్ ♦ శాంతిఁ బొందించి యుద్య|ద్ధ్వాంతా
రాతిప్రభుండై ♦ తనరుచు వెలిఁగెం ♦ దద్రణవ్యోమవీథిన్.

క. ఆతనిఁ జూచి సహింపక
యాతతకార్ముకుఁడు ద్రుపదు ♦ ననుజుఁడు శౌర్యో
పేతుఁడు సత్యజితుం డను
నాతఁడు ధీరుఁ డయి తాఁకె ♦ నతిరభసమునన్.

క. కడఁగి ద్రుపదానుజుఁడు నె
వ్వడిఁ గవ్వడి నేసె నూఱు ♦ వాఁడిశరములం
గడు నలిగి వానినన్నియు,
నడుమన తునియంగ నేసె ♦ నరుఁ డస్త్రములన్.



క. వివిధాస్త్రకోవిదుఁడు వా
సవి వాజిరథంబుఁ బ్రాక్షిఁ ♦ సారథుల మహిం
గువలువడ నేసె నుగ్రా
హవమునకును వాఁడు విముఖుఁ ♦ డై చెడిపఱవన్.

వ. అంత.

క. శరమోక్షణవేగనిరం
తరమండలితోరుచాప ♦ దండుఁ డకాండో
ద్ధురదండధరుఁడ పోలెను
హరినందనుఁ దాఁకె ద్రుపదుఁ ♦ డత్యుద్ధతుఁడై.

మ. పరమాస్త్రికవిశారదుల్ బలయుతుల్ ♦ పాంచాలకౌం
తేయు లొం | డొరులన్ మార్కొని యేయునప్పుడు
తదీ ♦ యోగ్రాజిరంగంబు దు | స్తర నీరంధ్రనిశాత
సాయకతమ ♦ స్సంఛన్నమైనం బర | స్పర యుద్ధంబులు
దక్కి యోధులు నిశా ♦ భ్రాంతాత్ములై రచ్చటన్.

వ. అట్టి మహాద్వంద్వ యుద్ధంబున విజిగీషుండయి పాంచాలుండు పాండవమధ్యము ధనుర్మధ్యంబు భగ్నంబు గా నొక్కబాణంబున నేసి యార్చిన నలిగి వాసవసుతుం డుద్యతాసిహస్తుండయి శైలస్థలంబుమీఁదికి లంఘించు సింహంబునుంబోలె ద్రుపదురథంబుమీఁదికి లంఘించి వానిం బట్టికొనినఁ దత్సైన్యంబు హాహాధ్వను లెసంగ మహార్ణవంబునుంబోలె మ్రోయుచుండె నంత.

క. ప్రక్షీణదర్పు ద్రుపదు ర
థాక్షముతోఁ గట్టి తెచ్చి ♦ యర్జునుఁడు క్రియా

దక్షుఁడయి గురునకు గురు
దక్షిణగా నిచ్చి చేసెఁ • దత్సమ్మదమున్.

వ. ద్రోణుండు నర్జునుచేసిన పరాక్రమంబునకుఁ బరమహృష్టహృదయుండై ద్రుపదుం జూచి నగుచు నిట్లనియె,

క. ఏ రెవ్వరయ్య? ద్రుపదమ
హారాజులె? యిట్లు కృపణు • లయి పట్టువడన్
వీరికి వలసెనె? యహహా! మ
హారాజ్యమదాంధకార • మది వాసెనొకో?

ఆ. ఇంక నైన నమ్ము • నెఱుఁగంగ నగునొక్కొ
యనుచు నుల్లసంబు • లాడి ద్రుపదు
విడిచి పుచ్చె గురుఁడు • విప్రులయలుకయు
దృణహుతాశనంబు • దీర్ఘమగునె?



# II

## తిక్కనసోమయాజి (భారతము)

—: అవతారిక :—

శ్రీయన గౌరి నాఁ బరఁగు • చెల్వకుఁ జిత్తము పల్లవింప భ
ద్రాయితమూర్తియై హరిహరంబగురూపముదాల్చి విష్ణురూ
పాయ నమశ్శివాయ యని • పల్కెడు భక్తజనంబు వైదిక
ధ్యాయితకిచ్చ మెచ్చు పరతత్త్వముఁ గొల్చెదనిష్టసిద్ధికిన్.

వ. అని సకలబ్రహ్మప్రార్థనంబు నేసి తత్ప్రసాదాసాదితకవిత్వతత్త్వ నిరతిశయానుభావానందభరితాంతఃకరణుండ నగు చుండి యొక్కనాఁ డిట్లని వితర్కించితి.

శా. విద్వత్సంస్తవనీయభవ్యకవితా • వేశుండు విజ్ఞానసం
పద్విఖ్యాతుఁడు సంయమిప్రకరసం • భావ్యానుభావుండు
కృష్ణద్వైపాయనుఁడర్థిలోకహితనిష్ఠం బూని కావించె ధ
ర్మాద్వైతస్థితి భారతాఖ్య మగు లేఖ్యం బైనయామ్నాయ
మున్.

క. వేదములకు నఖిలస్మృతి
వాదములకు బహుపురాణ • వర్గంబులకున్
వాదైనచోటులను దా
మూదల ధర్మార్థకామ • మోక్షస్థితికిన్.

వ. అదియును.

ఉ. ఆదరణీయసారవివి • ధార్థగతిస్ఫురణంబు గల్గి య
ష్టాదశపర్వనిర్వహణ• సంభృతమై పెను పొంది యుండ నం
దాదిఁదొడంగి మూఁడుకృతు •లాంధ్రకవిత్వవిశారదుండువి
ద్యాదయితుం డొనర్చె మహి • తాత్ముఁడు నన్నయభట్టు
దక్షతన్.

మ. హృదయాహ్లాది చతుర్థ మూర్జితకథో•పేతంబు నానారసా।
భ్యుదయోల్లాసి విరాటపర్వ మట యు • ద్యోగాదులుం
గూడఁగాఁ । బదియేనింటిఁ దెనుంగుబాస జనసం • ప్రార్థ్యం
బులై పెంపునం । దుది ముట్టన్ రచియించు టొప్పు బుధ
సం • తోషంబు నిండారఁగన్.

క. అని రచనాకౌతుకమున
మన మలరఁగ నీప్రబంధ • మండలి కధినా
థునిఁగా నేపురుషునిఁ జే
ర్కొనువాఁడనొ యనుతలంపు • గూరినమదితోన్.

వ. ఇందుక నిద్రించుసమయంబున.

సీ. మజ్జనకుండు స • న్మాన్యగౌతమగోత్ర
మహితుండు భాస్కర•మంత్రితనయుఁ
డన్నమాంబాపతి • యనఘులు కేతన
మల్లన సిద్ధనా•మాత్యవరుల
కూరిమితమ్ముండు • గుంటూరివిభుఁడు కొ
మ్మనదండనాథుండు • మధురకీర్తి
విస్తరస్ఫారుఁ డా•పస్తంబసూత్రప
విత్రశీలుఁడు సాంగ • వేదవేది



తే. యర్థిఁ గల వచ్చి వాత్సల్య • మతిశయిల్ల
నస్మదీయపరిణామంబు • నాదరించి
తుష్టి దీవించి కరుణార్ద్ర • దృష్టిఁ జూచి
యెలమి నిట్లని యానతి • యిచ్చెనాకు.

వ. "కిమస్థిమాలాం కిము కౌస్తుభం వా, పరిష్క్రియాయాం బహుమన్యసేత్వమ్, కిం కాలకూటః కిము వా యశోదా, స్తన్యం తవస్వాదు వద ప్రభో మే॥" యని నీవు దొల్లి రచియించినపద్యంబు గాఢాదరంబున నవధరించి భక్తవత్సలుం డగుహరిహరనాథుండు నీదెస దయాళుండై యునికిం జేసి నిన్నుం గృతార్థునిం జేయం గార్యార్థి యయి నాకలోకనివాసి యయిననాకుఁ దన దివ్యచిత్తంబునం గల యక్కారుణ్యంబు తెలుపం గలుగునట్టి శక్తిం బ్రసాదించి నన్ను నాకర్షించి కొలిపించుకొని వీఁడె విజయంచేయుచున్నవాఁ డనుచుం జూపుటయు సవిశేషసంభ్రమసంభరితహృదయుండ నయి యవ్వేల్పునుం గనుంగొనునప్పుడు.

సీ. కరుణారసము వొంగి • తొరగెడుచాడ్పున
శశిరేఖ నమృతంబు • జాలువాఱ
హరినీలపాత్రిక • సురభిచందన మున్న
గతి నాభి ధవళపం•కజము మెఱయ
గుఱియైనచెలువున • నెఱసిన లోకర
క్షణమన గరళంబు • చాయ దోఁపఁ
బ్రథమాద్రిఁ దోఁతెంచు • భానుబింబము నా ను
రమ్మునఁ గౌస్తుభ•రత్న మొప్ప

తే. సురనదియును గాళిందియు • బెరసినట్లు
కాంతిపూరంబు శోభిల్ల • శాంతమూర్తి
నా మనంబు నానందమ•గ్నముగఁ జేయ
నెలమి సన్నిధి సేసె స•ర్వేశ్వరుండు.

వ. ఏనును భక్తిమయం బగు సాష్టాంగదండప్రణామం బాచరించి కొండొక దొలంగి వినయావనతుండ నై లలాటోపరిభాగంబున నంజలిపుటంబు ఘటించి నయనంబులు నవయవంబులును బ్రమదబాష్పసలిలవిలులితంబులును బులకపటలపరికలితంబులునుంగా నంతంత నిలిచిన నద్దేవుండు.

క. అనుకంపాతిశయంబునఁ
దనదక్షిణనేత్రమును సు•ధారోచియ కా
నను వింత లేక చూచి వ
దనమున దరహాసరసము • దళుకొత్తంగన్.

ఉ. వైదికమార్గనిష్ఠ మగు•వర్తనముం దగ నిర్వహించుచు
న్భేదము లేనిభక్తి మతి•నిర్మలవృత్తిగఁ జేయుచుండ మ
త్పాదనిరంతరస్మరణ•తత్పరభావము కల్మి నాత్మ స
మ్మోదముఁ బొందఁ గావ్యరస•ముం గొనియాడుచునుండు
[దెప్పుడున్.

వ. అందును.

క. పారాశర్యునికృతి యయి
భారత మను పేరఁ బరఁగు • పంచమవేదం
బారాధ్యము జనులకుఁ ద
ద్గౌరవ మూహించి నీ వ•ఖండితభక్తిన్.



తే. తెనుఁగుబాస వినిర్మింపఁ • దివురు టరయ
భవ్యపురుషార్థతరుపక్వ•ఫలము గాదె
దీని కెడ నియ్యకొని వేడ్క•నూని కృతిప
తిత్వ మర్థించి వచ్చితిఁ • దిక్కశర్మ.

వ. అనిన నద్దివ్యవచనామృతంబు నాయుల్లంబున వెల్లిగొనిన బునగిపునగి ప్రణామంబు లాచరించి యప్రమేయప్రభావభావనాతీతుం డయ్యును నప్పరమేశ్వరుం డాశ్రితులకు నత్యంతసులభుం డని బుధులవలన విని యునికిం జేసి నను బోంటి బాలస్వభావునకు నిట్టిమహనీయమహిమ దొరకొనుటయుం గలుగున కాక యని తలంచుచు నివ్విభునకు విన్నపంబు సేయుఁవాడ నయి కొమ్మనామాత్యునాననం బాలోకించి తదనుమతి వడసి యిట్లంటి.

క. భూరిభవత్కారుణ్య
క్షీరాంబుధి నాదు తుచ్ఛ•చిత్తంబున వి
స్తారమహితముగ నునిచితి
వారయ నచ్చెరువు గాదె • యఖిలాండపతీ.

ఉ. ఇంతకు నేర్చు నీకు నొక•యింతటిలోన మదీయవాణి న
త్యంతవిభూతిఁ బెంపెసఁగు•నట్టి నినుం గొనియాడఁ జేత దా
నెంతటిపెద్ద నీకరుణ • నిట్లు పదస్థుఁడ నైతి నింక జ
న్మాంతరదుఃఖముల్ దొలఁగు•నట్లుగఁ జేసి సుఖాత్ముఁ జేయవే.

వ. అని యుపలాలితుం డగు డింభకుండు దనకొలంది యెఱుంగక మహాపదార్థంబు వేఁడువిధంబున బ్రహ్మానందస్థితిం

గౌరి సర్వాంగాలింగితమహీతలం బగు నమస్కారంబు సేసిన నజ్జగన్నాథుండు.

తే. జననమరణాదు లైన సం•సారదురిత
ములకు నగపడకుండంగఁ • దొలఁగు తెరువు
గను వెలుంగు నీ కిచ్చితి • ననిన లేచి
నిలిచి సంతోష మెద నిండ • నెలవుకొనఁగ.

వ. మేలుకాంచి

క. ఎలమియు నచ్చెరువును సరి
నెలసి పొదలు మానసమున • నెంతయుఁ బ్రొద్దేఁ
గలలోనఁ గన్నచందము
దలఁచుచు నుండితిని భక్తి • తాత్పర్యమునన్.

వ. తదనంతరంబ.

ఉ. ఇట్టిపదంబు గాంచి పర•మేశ్వరునిం గృతినాథుఁ జేసి యే
పట్టునఁ బూజ్యమూర్తి యగు • భారతసంహితఁ జెప్పఁగంటి నా
పుట్టుఁ గృతార్థతం బొరసెఁ • బుణ్యచరిత్రుఁడ నైతి నవ్విభుం
గట్టెదఁ బట్ట మప్రతిమ • కారుణికత్వ మహావిభూతికిన్.

ఉ. కూర్చుట నూత్నరత్నమున•కుం గనకంబునకుం దగున్ జనా
భ్యర్చిత మైనభారత మ•పారకృపాపరతంత్రవృత్తిమైఁ
జేర్చిన దేవదేవుఁ డనుఁ • బ్రీతిగ నిచ్చుట సర్వసిద్ధి నా
నేర్చినభంగిఁ జెప్పి వరణీయుఁడ నయ్యెద భక్తకోటికిన్.

వ. ఇది యనన్యసామాన్యాకారం బగు పరమధర్మ ప్రకారంబు.



ఉ. కావున భారతామృతము • కర్ణపుటంబులనారఁ గ్రోలి యాం
ధ్రావలి మోదముం బొరయు • నట్లుగ సాత్యవతేయసంస్మృతి
శ్రీవిభవాస్పదం బయిన • చిత్తముతోడ మహాకవిత్వదీ
క్షావిధి నొంది పద్యముల • గద్యములన్ రచియించెదం గృతుల్.



—* ఉత్తరకుమారాట్టహాసము *—

ఉ. ఎత్తునఁ గొందుఁ గౌరవుల • నెల్లను మార్కొని రేని గోవులం
దెత్తు ముహూర్తమాత్రమునఁ • దేరికి సారథి లేమిఁ జేసి నా
చిత్తమునన్ విచారదశ • సెందెడు నెవ్వఁడు గల్గునొక్కొ నా
కిత్తఱి నేఁ గదా కడప • నెంతయు నేర్తు రథంబునం బురిన్.

క. తగుసారథి దొరకొనినం
బగతుర భంజించు టెంత • పలి కదుపుల ద
వ్వగఁ గొనిపోదురొక్కో యి
ట్లగునె కలండేని సూతు • వరయుం డెందున్.

చ. కురుపతి భీష్మ కర్ణ కృప • కుంభజ ముఖ్యులు మత్సముద్యమ
స్ఫురణము సూచి పార్థుఁ డను • బుద్ధిఁ గలంగఁగ బెట్టుగిట్టి సం
గరమున నోర్చి యేఁ బసులఁ • గ్రమ్మఱఁ దేకయున్న నన్ను భూ
వరుఁడు సుహృజ్జనంబుఁ బరి•వారముఁ జిత్తములందు మెత్తు రే.

వ. అనునప్పుడు తత్ప్రదేశంబున నునికిం జేసి.

క. విని ద్రుపదధరణిపతినం
దన సామర్థ్యాపహాస • తరళహృదయయై
చని తద్వృత్తాంతము మె
త్తనిపలుకులఁ జెప్పె నింద్ర • తనయునితోడన్.

వ. అతండు నజ్ఞాతవాసవత్సరం బతీతం బగుట నిరూపించి పాంచాలి కిట్లనియె. నీవు పోయి వారలతో నిట్లనుము. మన బృహన్నలకు సారథ్యంబు సేయు సామర్థ్యంబు గలదు. తొల్లి ఖాండవదహనంబునం బాండవమధ్యమునకు సారథియై యతని చిత్తంబు వడసె; మఱియుఁ బెక్కెడలం దదీయం బగు రథంబు గడపఁ దాన యైయుండు. నేను నెఱుంగుదుం; దత్సాహాయ్యంబునం గురుసైన్యంబుల జయించి వచ్చుటకు సంశయంబు వలవ దనుము; వారేమనిరేని మఱియుం దగ నాడి నన్నుం బిలిపించునట్టి తెఱంగు గావింపుమన, నట్ల చేయుదునని సైరంధ్రి యుత్తరయున్న యెడకుం బోయి.

చ. జనపతినందనుండు దగు ♦ సారథి నారయుచున్నవాఁ డెఱిం
గినపని సెప్పఁగా వలయుఁ ♦ గ్రీడి మనంబున మెచ్చునట్టి నే
ర్పును భుజశక్తియుం గలిగి ♦ రూఢికి నెక్కిన సూతవృత్తి మై
నని నడిసన్న యెత్తెఱ బృ ♦ హన్నలకుం గల దంబుజాననా!

తే. అర్జునునకు ఖాండవదహ♦నాదులైన
విక్రమము లాబృహన్నల ♦ వెరవు లావు
గాదె జయ మొనరించె లో♦కంబు లెఱుఁగ
నువిద దీని నెఱింగింత ♦ యుత్తరునకు.

క. అని యమ్ముదితయుఁ దానును
జని యతనికి నత్తెఱంగు ♦ సముచితముగఁ జె
ప్పిన నక్కుమారవరుఁ డి
ట్లనియెం బాంచాలితోడ ♦ నల్లన నగుచున్.



తే. అకట సైరంధ్రి నన్ను ని♦ట్లాలిగొనఁగ
నేల చక్కఁగఁ గను విచ్చి ♦ యేను పేడిఁ
జూడరోయుదు రణమున ♦ సూతకృత్య
భరము దాల్చుట కెమ్మెయిఁ ♦ బనుచువాఁడ.

వ. అదియునుం గాక.

చ. కురుబల మేఁగుదెంచెనటె ♦ గోవుల బిట్టుఱఁ బట్టి దానిపైఁ
బరిగొని శౌర్యసంపదయు♦ బాహుబలంబును జూపఁ బూనియే
నరిగెదనట్టె తేరికి బృ♦హన్నల సారథియైన దీని న
వ్వారె పురిలోన నింతకఱ♦వా రథచోదకు లింతయేటికిన్.

వ. అనిన విని సైరంధ్రి యతని కిట్లనియె.

ఉ. కౌరవసేన గాదు త్రిజ♦గంబులు నొక్కట నెత్తి వచ్చినం
దేరు బృహన్నలావశగ♦తిం జరియించిన గెల్వవచ్చుఁ ద
ద్వీరగుణంబు సొంపు పృథి♦వీరవనందన మున్నెఱుంగుదుం
గారణజన్మమై తనువి♦కారము వచ్చెఁ బెంపు దప్పునే.

వ. అనవుడు.

క. మన మురియాడుచు నుండఁగఁ
దనకోరు లప్పటికి లేమి ♦ ధరణీశ్వర నం
దనుఁడు బృహన్నలఁ బిలువం
బనుచుట కోడఁబడిన పలుకు ♦ వలుకుటయుఁ దగన్.

వ. సైరంధ్రిదెసఁ గనుంగొని యేనుబోయి తోడ్కొని వచ్చెద నని పూని యుత్తర,

ఆ. మెఱుఁగు మొగిలుసొచ్చు • తెఱఁగున నాట్యమం
దిరము సొచ్చి తనదు • గురువుకడకు
నరిగి నెమ్మి నిట్టు•లను నింతి ప్రార్థనా
వినయ సంభ్రమములు • పెనఁగొనంగ.

క. ఇచ్చట నొకకయ్యంబునఁ
జచ్చె మదీయాగ్రజన్ము • సారథి తగువాఁ
డెచ్చోట లేమి నాతం
డచ్చుపఱపఁడయ్యె నీక్రి•యకు నొండొకనిన్.

వ. అది యట్లుండె; నేఁడు కౌరవులు పసులం బట్టిరని కూయివచ్చిన నన్న సన్నద్ధుండై వెనుకం దగులనమకట్టి సారథ్యంబు సేయువాఁడు లేమికి విషాదంబు నొందిన నీకందువ సైరంధ్రి సెప్పినం బ్రియంబంది నిన్నుఁ దోడ్తేర నన్నుఁబనిచిన నేనును నీపాల నాకుఁ జనవు గలుగుటం జేసి యెల్లవిధంబు లందెత్తునని పూని వచ్చితి; నీవును నాపలుకులు గుఱుచ సేయక నీపెంపునం బ్రకటంబుగా నయ్యుత్తరకుమారునకు రథంబు గడప నియ్యకొని యియ్యాపదఁ దలఁగవలయు; నిట్లొడంబడక తక్కుట నావలని వాత్సల్యంబు గొఱంతపఱచుట యనిన నమ్ముద్దియపలుకులు ముద్దుసేసి.

క. నగుచు బృహన్నల యిట్లను
జగదీశ్వరపుత్రి నాకు • సారథ్యము నే
ర్పు గలదె నీమాటకు నే
మిగులంగా వెఱతుఁ బోదము•మీఁదట్లుండెన్



క. భవదీయ ప్రార్థనచేఁ
దివిరి పరమదుష్కరములు • దీర్చి యయిన ను
త్సవ మొనరించెద సార
థ్యవిధం బొకఁ డనఁగ నేల • యంబుజవదనా!

వ. అనుచు సంగీతనిలయంబు వెలువడి సలీలంబుగా మెత్తమెత్తన నడతెంచు మత్తశుండాలంబునుంబోలె.

తే. అరుగుదెంచు బృహన్నల • నంత నంతఁ
గని నృపాలసుతుం డను • గారవమునఁ
గౌరవులతోడఁ గయ్యంబు • గలిగె నాకుఁ
గడఁగి నేఁడు రథమ్మీవు • గడపవలయు.

క. వే రమ్ము మైమఱువుఁ దొడి
తేరెక్కుము దప్పఁ గ్రింకఁ • దీఱదు నీకున్
సైరంధ్రి సెప్పె నీదగు
వీరమ్మున పెంపు లావు • వెరవును మాకున్.

చ. అనుటయు నాటపాట గల • యప్పటికిన్ ననుఁ గోరి పిల్వఁ
బం। చినఁ దగుఁ గాక సంగరము • చేతకు సారథి గమ్ము
రమ్ము నీ । వను టుచితంబె యెల్లెడఁ • నారసి బాహు
బలాఢ్యుఁడైన యొ । క్కని రథ మేడ్తెఱం గడపఁ•గా
నియమింపుము రాజనందనా!

వ. అనిన విని వైరాటి కిరీటి కిట్లనియె.

ఉ. ఖాండవ మేర్చునప్పుడు ద•గన్ రథచోదకవృత్తి సల్పి యా
ఖండలసూతికిన్ జయము • గల్గ నొనర్చినయట్టిబుద్ధియున్

దండితనంబు నీయెడన • తక్కెనె నాదెస మైత్రి పెన్పుమిం
కొండొకమాట దక్కుము ర•ణోత్సహానం బొనరింపు
గ్రక్కునన్.

తే. అనిన నాతని మాటకు • నడ్డమాడ
వెఱచినట్టి తెఱంగు భా•వించి యల్ల
నియ్యకొనుటయు నమ్మను•జేంద్రసుతుఁడు
దృఢతనుత్రాణ మతనికి • దేరఁ బనిచె.

క. తెప్పించి తొడుగు మీవని
యొప్పించిన నిట్టునట్టు • నొఱవలుగా మైఁ
గప్పికొని యాబృహన్నల
యప్పుడు నగుపించె నచటి • యబలాజనమున్

క. ఉత్తరుడు సత్వరంబుగఁ
దత్తనువున వఱువ్ర దొడిగి • తానును హృద్యో
దాత్తం బగుకంటక మిడి
చిత్తము పసిఁ గ్రమ్మఱింపఁ • జిడిముడి పడఁగన్.

వ. బృహన్నల నవలోకించి.

క. హయములఁ బూన్పుము రథమున
రయమున సిడమెత్తు మిపుడ • రావలయును గో
చయముఁ గొని యస్మదీయ వి
జయ మభినందింపఁ బురము•జను లెదురుకొనన్.

తే. అనిన నీ వేమి పనిచిన • నట్ల చేయ
వలయు నీ వున్నయెడ నుండ•వలయు నీవు



నన్ను దెసఁ జనవలయు నా•శక్తి యెఱిఁగి
పంచి పనిగొని కడిమిమైఁ • బగఱ గెలుము.

వ. అని పలుకుచు మనంబున ముదం బొదవ నా ధనంజయుండు.

క. కాంచనజాలాలంకృత
చంచత్తనులీల మెఱయు • జవనాశ్వములం
బూంచి రథంబున మణిమయ
పంచాననకేతు వెత్తె • బంధురభంగిన్.

వ. అంత ధనుస్తూణీరకృపాణముద్గరాది వివిధసాధనంబులు రథంబుపైఁ బదిలంబుగా నిడి నొగ లెక్కి పగ్గంబుల నుగ్రక్క నక్కంజేయ నుత్తరుండును బసులం బట్టినదెస గోపాలకు నడిగిన వాఁడు పితృవనంబువల నని చెప్పిన వినుచు రథారోహణంబు సేసి వెడలి పౌరవృద్ధపుణ్యాంగనా భూసురసమూహంబులు బృహన్నలం జూచి తొల్లి ఖాండవదహనంబున సర్వజ్ఞునకు నీకతంబున నయిన మాంగల్యం బెట్టి దట్టిద భవత్సాహాయ్యంబున భూమింజయున కయ్యెడు మని దీవించి సేసలు సల్లం బురంబు నిర్గమించి నిరర్గళపరాక్రముండయిన యాఫల్గును నైపుణంబున వల్గదశ్వంబగు రథంబు రయంబునకు మెచ్చుచుం బరేతనిలయప్రాంతప్రదేశంబు నేరం జని.

సీ. అభినవ జలధర•శ్యామంబు లగునెడ
లాకుజొంపంబుల • ననుకరింప
సాంధ్యరాగోపమ•చ్ఛాయంబు లగుపట్లు
కిసలయోత్కరములఁ • గ్రేణిసేయ

రాజమరాళ గౌరము లగు చోటులు
దలఁచుఁ బూఁబోదలచం•దంబు నొందఁ
హరిద్రరుచిసమా•నాకృతు లగురావు
లడరెడుఁ బుప్పొడు • లట్లు మెఱయఁ

తే. గలయ నెగసి ధరాధూళి • లలితవనము
జివికి నలిఁ గాఁవు వోయెడు • తెఱఁగుఁ దాల్చ
గోగణము మ్రుంగలిగ నేల • గోడివడఁగ
నడచు కౌరవరాజసై•న్యంబుఁ గనియె.

క. కని యుత్తరుండు గరుపా
ఱిన మేనును దలకు మనము • ఱిచ్చవడినచూ
పును నై తొట్రుపడుచు ని
ట్లనియె దిగులు సొచ్చి యాబృ•హన్నలతోడన్.

శా. భీష్మద్రోణకృపాది ధన్వినికరా•భీలంబు దుర్యోధన
గ్రీష్మాదిత్య పటుప్రతాపవిసరా•కీర్ణంబు శస్త్రాస్త్ర జా
లోష్మస్ఫారచతుర్విధోజ్జ్వలబలా•త్యుగ్రం బుదగ్రధ్వజా
ర్చిష్మత్త్వాకలితంబు సైన్య మిది యేఁ • జేరంగ శక్తుండనే?

క. అకృతాస్త్రుఁడ బాలుఁడఁ గా
ర్ముకవిద్యాప్రౌఢిమై ని•రూఢులయిన యీ
శకుని జయద్రథ దుర్ముఖ,
వికర్ణ కర్ణాదియోధ • వీరుల కెదురే?

క. ఇట్టగు టెఱుఁగకవచ్చితి,
మెట్టొకొ మనభంగి వీర • లిందఱును గడుఁ



బెట్టిదులు మనకు మార్కొను
నట్టికొలఁది గాదు భీతి • యడరెడుఁ దొడ్తోన్.

ఉ. కౌరవసేనఁ జూచి వడఁ•కం దొడఁగెన్ మదితోన మేను నీ
వూరక పోవుచున్కి యిది•యొప్పునె యిప్పటిభంగిఁ జూచిన
న్వీరల నేను మార్కొనమి•నిశ్చయ మట్లగుటన్ రయంబునం
దేరు మరల్పు ప్రాణములు • దీపనమున్ వినవే బృహన్నలా!

వ. అనిన దరహాసితవదనుం డగుచు శతమఖతనయుం
డతని కిట్లనియె.

చ. అసదృశలీలఁ బొల్చు రథి•కావలిమీఁదఁ జనంగ వెఱ్ఱినే
మసలక యామిషంబు•గొనిమార్గమువట్టినతుచ్ఛసైన్యమున్
వెసఁ జని ముట్టిగోధనము•వేగ మరల్తము గాక యిమ్మెయిం
బసులటు వోవఁగా మరలఁ•బాడియె నీకు నరేంద్రనందనా!

ఉ. అంతిపురంబులోనఁ గల • యంగన లెల్లను నెమ్మనంబులన్
సంతస మందఁగా బసులఁ • జయ్యనఁ దెచ్చెదనంచుఁ బూని నీ
వెంతయు మేటివై యరద•మెక్కి రయంబున వచ్చి యిచ్చటన్
దంతితురంగసద్భటక•దంబము, జూచి కలంగు టొప్పునే?

ఆ. అనినపలుకులకు బృ•హన్నలఁ గనుఁగొని
యెలుగుపడఁక నాతఁ • డిట్టులనియెఁ
బసుల దయ్య మెఱుఁగుఁ • బడఁతుల సంతోష
మేల నాకు ననికిఁ • జాల నేను.

వ. అనవుడు.

చ. తనభుజశక్తియున్ రిపుల • దర్పము నేర్పడఁ జూచిచూచి యె
ట్లును దెగకున్నఁ బోక యిది • లోకముచక్కటి శూరులైన దీ
నిని మది మెచ్చ రీబలము • నీ దెసఁ జేఱెయుఁ జూడ దింతకున్
మునుభయహేతువైనవిధ • ముం దగఁ జెప్పుము నాకు నిత్తఱిన్.

సీ. దెసలు బీటలు వాఱ • దివురుచిందముల కో
లాహలంబులకుఁ గ • లంగఁబడక
యురవడి సేనలు • దెరలఁ బైఁ దోఁతెంచు
ధూళి పెల్లడరినఁ • దూలపోక
చతురంగబల మతి • సాంద్రిఁగ గవిసిన
యగ్గలికమునకు • బెగ్గడిలక
శస్త్రాస్త్రములు రథ్య • సారథివర్మాంగ
తతి నాటుతఱుచునఁ • దల్లడిలక
తే. బహువిధంబులఁ బగతుర • బరవసమున
నిత్తెఱంగునఁ గలుగు క్రిం • దెల్ల నోర్చి
నిల్చి గెల్చిన సత్కీర్తి • నెగడుఁగాక
దవ్వుదవ్వుల నిట్లైన • నవ్వరెట్లు.

చ. అనుదివిజేంద్రనందనున • కమ్మనుజేశ్వరసూను డిట్లనున్
వినుము త్రిగర్తవాహినులు • విక్రమసంపదసొంపు మీఱ గో
ధనములఁ బట్టినం బతియు • దగ్రితసైన్యము లెన్నియున్ని యుం
గొనియటవోయెఁ గానమున • కుంబురిబాసట లేరయెవ్వరున్
తే. ఒంటి దలపడి కురుసేన • నోర్చువాఁడ
నే యిదేటికి వెడమాట • లిట్టు లాడ



వారు గానక ముందఱఁ • దేరు దోలు
కొని రయంబునఁ బురి కరు • గుటయ నీతి.

వ. అనినం బార్థుండు పార్థివనందనున కిట్లనియె.

క. వెగ డొంది యిట్లు పలుకగ
నగనే పగతురు ప్రమోద • మందగఁ బసులన్
దిగ విడిచి పురజనంబులు
దెగడంగా మగిడి పోక • దీనత గాదే.

వ. అట్లుంగాక.

మ. ననుసైరంధ్రిగడంగి పేర్కొనియెదా • నం బెంపుమైఁ బిల్చితో
డని తోడ్తెచ్చితి నీవు బంటుతనమ • ట్లగ్గించి పోరాలి దీ
పనలిచ్చెం దుదిఁబోయి కౌరవులు గో • వర్గంబుఁ గొంపోవఁగాఁ
గని యేఁగ్రిమ్మఱిరిత్తవోదునె భయా • త్కంపంబునం గేటికిన్.
తే. చిత్తవృత్తి యొక్కించుక • చిక్కఁ బట్టు
మిపుడ కౌరవ సైనికు • లెల్లఁ జూచి
వెఱగుపడ వేగమును లావు • వెరవు మెఱయఁ
గదుపుఁ బెట్టించి పోదము • గ్రిమ్మఱంగ.

వ. అనుచు వివ్వచ్చుండు గడంగి తేరు వోవ నిచ్చుటయు నాననంబు పల్లటిల్ల మానసంబు దల్లడిల్ల నాభూవల్లభకుమారుండు.

క. దవ్వుల విఱిగినఁ బౌరులు
నవ్వుదు రటె మేలు మేలు • నను నాఁగకు నీ

కొఱ్ఱవ్యారుగ దేని దలపడు
మెవ్విధిం జని తేమి యనుచు • నెత్తిరభీతిన్.

క. శరములు శరాసనము న
య్యరదముపై డిగ్గ విడిచి • యతి రభసమునన్
ధరణికి లంఘించి వెసం
బురిదెసకును లజ్జ వీటిం • బోవం బాఱెన్.

వ. ఇట్లు పాఱినం దనమనంబున గుత్సించుచు బీభత్సుండు యుగ్యంబుల పగ్గంబులు నొగల ముడిచి రథంబు డిగ్గ నుఱికి లంబకేశభారుండును నాందోళిత రక్తాంబర యుగళాంచలుండును నగుచు నతని వెనుకం బఱచి శుండాల రయ లీలాసమరేఖంబగు గమనంబున నర్జునుండు పదశతమాత్ర ప్రదేశపలాయితుం డైన భూమింజయు నెయిదిపట్టికొనిన నతండు,

సీ. వెలవెలం బాఱుచు • వెగడొందుఁ బెదవుల
తడియాఱ నెత్తయుఁ • దల్లడిల్లు
జల్లన నంగంబు • లెల్ల నిండఁ జెమర్చుఁ
బదములుఁ గరములుఁ • గుదియ వడఁకు
హృదయంబు తటతట • నదరంగఁ బెలుకుఱు
దీనదృష్టుల మోముఁ • దేఱి చూచు
నెలుఁగు గద్గదికఁ దొట్రిల నేడ్చు విడుమని
ప్రార్థించు మాటఁ గ్రొడ్పాటుదోఁప

తే. నిష్కళతశుద్ధహేమంబు • నిర్మలోజ్జ్వ
లాష్ట వైడూర్యములుఁ దురంగాఢ్యరథముఁ



గరటిదశకంబు నొకయూరుఁ • బురము పొచ్చి
నపుడ యిచ్చెద నీకను • నార్తుఁడగుచు.

క. నాతోడి వేఁడ్రిముడిం గడు
నాతురనై యెదురు చూచు • నంబకుఁ జేతః
ప్రీతిగఁ జని యాయమఁ బొడ
సూతుం బోనీఁగదే విశుద్ధచరిత్రా!

వ. అని మఱియు నానావిధ దీనాలాపంబులం బ్రార్థించుచుండం బార్థుండు నగుచు నతనిం దేరు సేరం దెచ్చి.

చ. వెఱవకు మన్న పోటు కురువీరులతోడ నశక్యమేని య
త్తెఱఁగది యేల నీకుడుగు • తేరికి సారథివమ్ము నాకుఁ జి
చ్చుఱపిడు గెట్టులట్టడరి • శూరుల మొత్తము నుగ్గుసేసెనం
బఱపెద సేన రాజుధృతిఁ • బాపెద గోవులఁ గ్రమ్మఱించెదన్.

క. అనుచు నొడఁబాటు లేక
న్నను నయ్యుత్తరుని నొగల • నడుకొన నిడి తా
నును రథమెక్కి రథికుఁడయి
చనియె నరుఁడు జమ్మి సేర • సమ్మదలీలన్.



— * కృష్ణార్జున సందేశము * —

తే. వినుము సంజయ ధృతరాష్ట్రవిభుని పెద్ద
కొలువునందుఁ దత్పుత్త్రులు • గురుఁడుఁ గృపుఁడు
నాపగానందనుఁడు మొదలైన సకల
జనులు వినుచుండఁగా నిట్టు • లనుము నీవు.

ఆ. అయ్యజాతశత్రుఁ ♦ డలుగుట నీళ్లల
నగ్గి పుట్టినట్టి ♦ దయ్యె మీకు
నార్ప వెరవు లేదు ♦ నేర్పుమై నింకఁ గా
వింప వలయుపనులు ♦ వినుఁడు మీరు.

వ. అవి యెవ్వి యంటేని.

సీ. కలయట్టివివిధార్థ♦ములు నశేషంబుగఁ
దగ నొసంగుఁడు స♦త్పాత్రములకు
జెలులఁ జుట్టముల నా♦శ్రితులను రావించి
సత్కరింపుఁడు సంత♦సం బెలర్ప
నిచ్ఛానుగుణముగ ♦ నింద్రియసుఖముల
ననుభవింపుఁడు హృద♦యంబు లలర
నాండ్రను బిడ్డల ♦ నయ్యైవిధంబుల
గారవింపుఁడు ప్రియ♦పూరితముగ

తే. మఱియు నెవ్వరిచిత్త మె♦త్తెఱఁగునందు
వాటమైయుండు నది యెల్ల ♦ వలయునట్లు
సేసి విహరింపుఁ డిం కెడ♦సేయ కనికి
నడవుఁ డఱచేతఁ బ్రాణంబు♦లిడి కడంగి

వ. అని చెప్పు మింత యేమిటి కంటేని.

ఉ. ఎందును నెవ్వరుం బడని♦ యెంతయుఁగష్టము పాటువచ్చినం గ్రొ
ౘందల మంది పాండువిభు♦కోడలు దవ్వుల నున్న నన్ను గో
విందుఁడ కావుమంచుఁ బల♦వించుట యోఁగఁగ రాని
యప్పుఁబోలెం దలపోయ వే్రగయి చ♦లింపక యున్నది
యెప్పుడున్ మదిన్.



తే. ఇట్టియేఁ దేరు గడపంగ ♦ నెందు నుతికి
నెక్కు గాండీవ మేత్తెఱ ♦ నెక్కువెట్టి
రెండుదొనలును బూని కి♦రీటి యనికి
వచ్చునేఁడెల్లి యెందు బో♦వచ్చు మీకు.

వ. అని పలుకునప్పటివారి యెత్తికోలును నీకొడుకు విడుపోవమియునుం దలంచి భయంబందితి; నితండు వారల నెఱుంగఁడు; భీష్మద్రోణులప్రాపును కర్ణగర్వంబును దన్ను గెలిపించు నని నచ్చి తొడరెడు ననిన విని ధృతరాష్ట్రుం డర్జునుం డేమనియె నని యడిగిన నతనికి సంజయుం డిట్లనియె.

క. నరుఁ డలుక వొడమియును సు
స్థిరుఁడై తనయెఱ్ఱసెరల♦చెలువునఁ గెందా
మరలం దెగడెడు కన్నుల
నరుణచ్ఛవి నెఱయ నిట్టు♦లనియె నరేంద్రా!

ఆ. ఆసుయోధనుండు ♦ నతనికిఁ దోడ్పడ
నరుగుదెంచినట్టి ♦ ధరణినాథ
చయము వినుచు నుండ ♦ సంజయ నావచ
నములు గాఁగ నిట్లు♦నంగ వలయు.

ఉ. పాండునియగ్రనందనుఁడు ♦ పాలడుగం దగనీఁడయేని మా
కొండన నేల మేలది సు♦యోధనుఁడింతకుమున్ను పెక్కులు
ద్దండతఁ దాను జేసినవి♦ధంబుల కెల్ల మెఱుంగు వెట్టిన
ట్లుండెడుఁగాక యేనును వృ♦కోదరుఁడుం బ్రియమందున ట్లుగాన్.

క మాయిరువురతోఁ గయ్యము
సేయ నతం డియ్యకొనిన ♦ సిద్ధించెర కా

దే యుచితచరితుఁ డగు కాం
తేయాగ్రజు కార్య మట్టి ♦ తెఱఁ గొప్పుఁ గదా.

క. వనవాసంబున భూశ
య్యను ధర్మజుఁ డున్నయట్టి ♦ యాయాసము వో
వునె యంపశయ్య దుర్యో
ధనుఁడు రణక్షోణిఁ బడక ♦ తక్కనయేనిన్.

ఉ. సూనృత మాది బన్నములు ♦ సూడక లోన నడంచినట్టి కో
పానల మెండియున్న నిబి ♦ డాటవిపైఁ బచరించు తీవ్రదా
వానలుఁ బోలి శాత్రవచ ♦ యంబుపయిం గవియించి నిల్చినం
గాని యుధిష్ఠిరున్ సరకు ♦ గాఁగొన రా ధృతరాష్ట్రనందనుల్.

మ. గద సారించుచు నంత్యకాలవిచల ♦ త్కాలాకృతిన్ భీము
డుఁ | న్మదమాతంగచయంబు నుగ్గుగ లన ♦ న్నానారథ
వ్రాతముల్ | చఁదియన్ భూరిహయవ్రజంబు పొడిగా
సంరంభతుంగాంగుఁడై | కదియం జూచి బలే సుయోధ
నుఁడు భాగం బిచ్చు రాజ్యంబునన్.

సీ. క్రోల్పులి వీఁకమై ♦ గోదగోని లేళ్లను
నఱుకు తెఱంగునఁ ♦ దఱియఁ జొచ్చి
పెనుగాలి జీమూత ♦ బృందంబుపై బెట్టి
దంబుగ వీచుచం ♦ దమున నడరి.
కసిమసంగిసమారి ♦ గడగిఁ జీవుల మీఁద
నుగ్రతఁ గవియున ♦ ట్లురవడించి
యాఁకొన్న లయరుద్రుఁ ♦ డాగ్రహంబున జగ
త్ప్రచయంబు మ్రుచ్చుడు ♦ భంగిఁ బొదివి



తే. నకులుఁడును దదనుజుఁడు సా ♦ త్యకియు నాసు
భద్రికొడుకును నెదిరిన ♦ బలమునెల్ల
బెదరఁ జెదర బడల్పడఁ ♦ బెల్లు సావఁ
జేయఁ గని కౌరవులు సంధి ♦ సేయువారు.

ఉ. చిత్తము లుల్లసిల్ల నల ♦ సింహకిశోరము లొక్కమై మదో
న్మత్తగజావళిం బొదువు ♦ మాడ్కి నరాతిబలంబు ముట్టి యు
ద్వృత్తిఁ గడంగి యప్రతిమ ♦ వీరులు ద్రౌపదిపుత్రులేవురున్
నెత్తురు నీరఁ దేల్చిన న ♦ నిం గని మీనృపుఁ డల్క దీఱెడిన్.

మ. చెలులుం జుట్టలు నిష్టభృత్యులు మహో ♦ జిం బ్రాణముల్
డాఁప కు | జ్జ్వలులై తోనడవన్ విరాటుఁడును బాం ♦ చా
లుండు నేపారి సే | నలయుద్రేకము రౌద్రముం బెనుప
నా ♦ నాహేతిఘోరంబుగాఁ | దలపడ్డం గని గాక స్రుక్కు
దురె గాం ♦ ధారిసుతుల్ మాటలన్.

చ. తఱిమి శిఖండి తన్నొగులు ♦ దాఁకఁగ నెవ్వరిదిక్కు జూడ కే
ర్తెఱఁ దవప్రాన్కపై మనము ♦ ధీరత నిల్పి రథంబు బల్విడిం
బఱపి కురుక్షితీశుఁడను ♦ బ్రహ్మకు వేయును నిండ భీష్మపై
కఱకినఁ గాక మాకు నగ ♦ మూరక యిత్తురె మీరు మేదినిన్.

శా. విద్యుద్దండము నిల్పి పొల్చుసగతిన్ ♦ విల్లందమైయుండ
నస్మద్యోధావలి మానసంబున రణో ♦ త్సాహంబు రెట్టింప
ధృష్టద్యుమ్నుండు గడంగి ద్రోణుఁ గడిమిన్ ♦ డాయంగవీ
క్షించి కా | కుద్యోగించుట యేల తక్కుదురు మీ ♦ రుగ్రా
హావక్రీడకున్.

సీ. గాండీవగుణరవం • బొండొండ చెలఁగంగ
శరపరంపర లాకసంబు గప్పఁ
బ్రతివిశిఖములు ఖండితములై రాలంగ
నెదిరి సైన్యంబుల • మదగజాది
చతురంగములును జర్జరితంబులై యవ
యవభేద మెఱుఁగని • యట్లు గాఁగఁ
దునిసిన నెత్తురు • నెనడును నెమ్ములు
నెఱచియుఁ గండలు • నెనసి సమర

తే. తలము ఘోరంబుగాఁ గపి • ధ్వజము ధవళ
హరులు శోభిల్ల నొగలపైఁ • హరి యెలర్పఁ
దేవదత్తంబు మ్రోయఁ దోఁ • తెంచునట్టి
రథముఁ గని కాని కానఁడు • రాజరాజు.

శా. బాలక్రీడ మహాసుర ప్రకరముల్ • భంజింపఁడే యెప్పుడుం
ద్రైలోక్యంబును భక్తియుక్తిఁ దగనా • రాధింపదే యట్టిశౌ
ర్యాలంకారు మహాత్ముఁ దాసరకు సే • యండచ్యుతుల్ మమ్మతం
డేలా కైకొను నా సుయోధనుని యం • దెగ్గేది యూహింపఁగన్

వ. ఏము పితామహ గురుకృపాచార్యులకు నమస్కరించి యస్మదీయ రాజ్యభాగంబునకై తొడరి కయ్యంబు సేయువారము; కౌరవులకుం బూని యెవ్వరే మాతోఁ బెనంగినను వారిశస్త్రంబులు ధర్మప్రతిహతంబు లగునని తలంచెదము; పండ్రెండు వత్సరంబులు వనంబున నమ్మయి నిడుమలంబడి జనపదంబునం బదుమూఁడగు నేఁ డజ్ఞాతవాసాయాసం బట్లను భవించి వచ్చి మా తండ్రిపాలికిం బెనంగు మమ్ము నింద్రాది సురసహాయు లయ్యును ధార్తరాష్ట్రులు గెల్చువారైరేని ధర్మంబుకంటె నధర్మము బలవంతంబైనయది యగు; నిట్టియ కాని మా చేయునట్టిది గీడైనది గా; దేము వాసుదేవుని మున్నిడికొని నడతుము; గావున నీయుద్ధంబున జయంబు మాకు సిద్ధంబ. ఎల్లభంగులం గర్ణసహితంబుగా గాంధారీనందనులం దునిమి యేము భూమి గొనుట దప్పదు. గాండీవంబు దివియకయును గుడుసువడియెడు బాణంబులు దమయంతన తూణీరంబుల వెడలెడుఁ దోలూడ్చు మహానాగంబునుంబోలెఁ గరవాలంబు దాన యొఱ వెలికి నిగుడుచున్నయది గావున మాకవశ్యంబును సంగరంబు సంభవించుఁ; బాశుపతాది దివ్యశరంబులం గురుపక్ష ప్రజాక్షయంబు సేసి శాంతిం బొందెదము. సూతనందనా! నీవు సుస్థిరుండవై యింతయుం దెలియం బలుకవలయు నిమ్మాటలు విని కురువృద్ధుండగు బాహ్లికుండును బితామహుండగు భీష్ముండును గురుండగు కుంభసంభవుండును శిక్షకుండగు కృపాచార్యుండును గురుపుత్రుండగు నశ్వత్థామయు సద్బుద్ధి యగు విదురుండును ధర్మాచరణ కల్యుండగు శల్యుండును నెయ్యది నిశ్చయించి పలికి రది యయ్యెడు; సుయోధనాదు లాయుష్మంతు లగువార కాక.

—* శల్యసారథ్యము. *—

వ. మద్రపతి కర్ణు నవలోకించి.

ఆ. హితము సెప్పఁ దగనె ♦ యే నీకు నదియును
గాక నీరథంబు ♦ గడపుచుండి
కౌరవాధినాథ ♦ కార్యార్థినగు నాకు
నున్నరూపు సెప్పకుండ నగునె?

ఉ. సారథి దక్షుఁడై రథికసారము రథ్యబలంబు నాయుధో
దారత మానముం రణవిధంబు నిమిత్తశుభాశుభత్వని
ర్ధారణముం మదిం గని హితం బెఱిఁగించుట నీతి గాన నీ
వీరస మెత్తి నోఁ బలికి ♦ తేనియుఁ జెప్పెదు సూతనందనా!

వ. ఏ నేమితప్పు సేసిన గదం దల వగుల వ్రేసెదవు. నీ విట్లంటివి గదా యని హితోపదేశంబు మాన నేర్తునే? ఇది యొక దృష్టాంతంబు వివరించెద వినుము. విని, నీవు నా చెప్పినట్లు చేసితేనియు మేలు. సేయ కుండినం గడుమేలని యిట్లనియె.

సీ. అంబుధిలో నొక్క ♦ యలఘుతరద్వీప
మున ధర్మవర్తి నాఁ ♦ జను నరేంద్రు
పురమున నొక వైశ్య ♦ వరుఁ డధ్వరాదిస
త్కర్మరతుఁడును శాంతి ♦ దాంతియుతుఁడుఁ
గరుణాపరుఁడు దాన ♦ నిరతుండు ధనధాన్య
శోభియు బహుపుత్రలాభ విలసి
తుండు నై వర్తించు ♦ చుండఁగ నిలుసేరె
నొక కాకి యతని పుత్రకులు దాని



తే. కౌఁగిలులు వెట్టి కొనియాడ ♦ నెలమిఁ బెరిఁగి
క్రొవ్వి కడు మీఱి యెట్టి పక్షులును దన్నుఁ
బోల వనియెడు దుర్మానమునఁ దృణీక
రించి యది పెక్కుభంగులఁ ♦ గ్రీడ సలుపు.

వ. ఇట్లు విహరించుచుండ నొక్కనాఁడు గొన్ని హంసంబులు పక్షబలంబున సుపర్ణుతో సరిసేయం దగునట్టివి సముద్రంబు చేరువఁ జనం గని యా కోమటికొడుకు లక్కాకంబు నకు వానిం జూపి యిట్లనిరి.

క. పులుఁగులలో నీ వెక్కుడు
విలసద్గతి నంచ లిట్లు ♦ వినువీథిఁ గరం
బెలమిం జనియెడు వీనిం
గలసి పఱచి గెలువవలదె ♦ గతుల బహులతన్.

వ. అని తారతమ్యజ్ఞానహీను లగు నయ్యల్పబుద్ధులు సెప్పిన నుచ్ఛిష్టదర్పితం బగు నదియును మౌర్ఖ్యంబునం దానంతటిదాన నని తలంచి వానిదెసకుం జని మనంబున వీనిలో మేటి యెయ్యదియో యనుచుం జేరి తనచూడ్కికి వచ్చిన యంచం బురుడించి పఱతము రమ్మని పిలిచిన నయ్యంచ లన్నియు నిలిచి బెలుచ నవ్వి యవ్వాయసంబున కిట్లనియె.

క. మానససరసి వసింతు మ
హీనబలంబును జవముఁ బక్షు ♦ లెల్లను బొగడం
గా నెందుఁ దిరుగుదుము ద
వ్వైనను ఖేదంబు లేదు ♦ హంసల మగుటన్.

వ. ఇట్టి మాయందును.

క. బలశాలి వైన హంసముఁ
బిలిచితి పురుడించి పాఱ ♦ బేలతనమునన్
గలవే యింతకు మును హం
సలతోఁ బురుడించు వాయ♦సంబులు జగతిన్?

సీ. అనుటయుఁ గాక మి ♦ ట్లను హంసములతోడ
గతులు నూటొక్కటి ♦ గలవు వాన
నొక్కటొక్కట శత♦యోజనవ్యాప్తి నే
మెఱయుదుఁ బొడవుగా ♦ మీఁది కెగసి
చనుట యచ్చటనుండి ♦ చక్క నేలకుఁ జోడు
వట్టి డిగ్గుట దూర ♦ పాతభంగి
సంగతి పరువడి ♦ చారులీలాగతి
వక్రియానము వల♦యక్రియంబు
ఆ. లోనుగాఁగ నెట్టు ♦ లైనను మీకోరి
నట్ల పఱచి మేటి ♦ యంచయైన
దాని నిపుడ గెల్తుఁ ♦ దక్కటియంచలు
భయమువొందఁ గాకి ♦ పదువువొంగ.

వ. అనుటయు విని మున్నాహూతంబైన హంసం బక్కాకంబు నాలోకించి.

ఆ. నూఱుగతుల నీవు ♦ వాఱు దే నన్నియు
నెఱుఁగఁ బులుఁగు లెల్ల ♦ నెట్లువాఱు
నదరి యాకసమున ♦ నిడుబాట నట్ల పా
ఱుదము రమ్ము జలధి ♦ చదల ననిన.



వ. అయ్యెడం గూడినకాకంబు లపహసించి శతప్రకారగతి యగు దీనితో నేక యానపర్యవసానహీన సముత్సాహదోహలి వగు నీ వెట్లు మచ్చరించెదవు; పఱచి భంగపడియెదవు గాక యనుటయు నమ్మరాళం బాగమిం బాసి పఱవఁ దొడంగినం దోన యవ్వాయసంబునుం బఱచె; నిట్లు రెండును మున్నీటిపై మిన్ను దఱిసి పాఱునట్టియెడ.

క. రాయంచ మందగతిఁ జను
వాయస మతి తీవ్రభంగి ♦ వలను మెఱసి లీ
లాయితము లొప్ప బహుగమ
నాయాసము నొంది పఱచు ♦ నగ్గలికమెయిన్.

ఆ. ఎలమిఁ గడఁచి పోవుఁ ♦ బిలుచుఁ గ్రమ్మఱి వచ్చి
ముక్కు ముక్కుమీఁద ♦ మోవుఁ జుట్టు
నేచి తిరుగు నీఁక ♦ లీఁకలతో రాయుఁ
నొరయుఁ జిత్రగతుల ♦ మురియు నవ్వ.

వ. ఇవ్విధంబునం గాకం బనేక ప్రకారప్రసరణచతురంబై సంచరించుటం జూచి ముదితంబులైన వాయసంబు లధికస్వరంబుల మెఱయుచు హంసంబుల గేలిగొని నవ్వుచుఁ దరువులపయిం ద్రుల్లి త్రుల్లి యాడుచు మరాళంబు పరాభవంబుఁ బొందెడుఁ జూడుం డని పెద్ద యెలుంగునం బలుకుచుండఁ దదీయ కలకలం బాలించి హంసంబు భరితోత్సాహంబై.

క. పొడవునకు నెగసి యెప్పటి
పడమటిదెస నిగిడి వెలుచఁ ♦ బఱచినఁ గూడం

గడురయమునఁ జని యంచం
గడవంగా కీలకఱచి • కాకము పాఱున్.

వ. పాఱి పాఱి దయ్యుట్టయు నయ్యంచ యుదంచిత త్వరితగమనకళావైదగ్ధ్యంబు మెఱయం బఱచిన బీరువడి కాకం బాకులాంతరంగంబును వికలాంగంబునునై యిట్లని వితర్కించు.

క. నేరక తొడరితిఁ గాల్కాన
భూరుహములు లతలు గిరులుఁ • బొడ లేమియు లే
వారయ బహుసత్త్వమయము
వారిధి డిగి సోఁకినపుడ • వలయుం బొలియన్.

ప. అనుచు దీనమానసం బయి భయంబునం గలంగి డప్పి సొగసి యవశత నంతకంతకు డిగుచున్న యక్కాకిం గనుంగొని కలహంసం బిట్లనియె.

ఆ. నీవనేకగతులు • నేర్తిది యేగతిఁ
జనుట చెప్పుము వాయ•సంబ యేను
గడవ నరిగి పిలువఁ•గా నేల తడసెద
వెఱక లేటి కిట్టు • లెడల విడువ.

వ. అనియె నట్టియెడ.

క. తలకొని జలములు పక్షం
బులు ముండముదోఁక సోఁక • బొరిబొరి నెగయన్
బల మెఱి మెయి దిగఁబడఁగా
సొలసి యెగయ లేక వాయ•సుండు వెగడొందెన్.



వ. ఇట్లు మున్నీటినీటిపాయిం బడి నగ్గలం బగు దురవస్థకు బెగ్గలంబు నొందు కాకంబు నాలోకించి పలుకనగుం గాక పలికినట్లు యెవ్వరికిఁ జేయఁ దీరఁ బని తీరెంగదా యనివ రాయంచకు నక్కాకం బిట్లనియె.

క. ఎంగిళులు గుడిచి క్రొవ్వునఁ
బొంగినమెయితోడ గర్వ•మునఁ దిరుగుచు నా
కుం గలదె యొందు నెదురు వి
హంగమపతి నైన గెలుతు • ననిమును దలఁతున్.

క. నాకోలఁది యిప్పు డెఱిఁగితి
నీకరుణాలోకనంబు • నిగిడించి శర
ణ్యా కావు నన్ను మగుడం
గాకులలోఁ గలుపఁ దగవు • గాదే నీకున్.

వ. అని యుత్తరంగున.

క. ఆకులతఁ బొంది పలుకుచుఁ
గా కా యని చంచు దెఱప•గా నఱచుచు నీ
రాకరమున మునిఁగెడు న
క్కాకిం గలహంస పరమ•కారుణ్యమునన్.

క. వెరవునఁ దత్తనువుం దన
చరణంబుల నిఱికి సొత్తి • చా వుడిపి బల
స్ఫురణంబు మెఱయ వీఁపున
ధరియించుచు వచ్చెఁ బక్షి•తతులు నులింపన్.

వ. ఇవ్విధంబునం దెచ్చి యెప్పటినెలవున డించి రాయంచ యక్కాకి దెప్పిఱిన దానితో నచ్చటికాకులు విన నింక

నిట్టియవినయంబు లెన్నండును జేయకు మని పలికి నిజసహచరంబు లగుమరాళంబులుం దానును వలయుచోటికిం జనియె. నీవు నాకోమటికొడుకుల యెంగిలికూటం బెరిఁగినయక్కాకంబు చందంబునఁ గురుకుమారుల యెంగిళులు గుడిచి క్రొవ్వి యెక్కుడువారల ధిక్కరించెదవు. నీకోలఁది యెఱుంగవు. దీనం జేటు వాటిల్లుఁ గాన తేటపడ నెఱింగించెద నాకర్ణింపుము.

చ. విరటునిగోవులన్ మరల • వెల్చి మదంబున నీదుతమ్మునిం
బొరిగొనఁ బార్థుఁ డాఁక కెట • పోయితి నాఁడు ఘోషయాత్రలోఁ
గురుపతి డించి క్రీడి కృప•కుం దగుపాత్రము సేసి యెక్కడన్
సురిఁగితి చెప్పుమా నిజము • సూతతనూభవ నాకు నేర్పడన్.

వ. అని వెండియు.

చ. పనివడి జామదగ్న్యుఁడు స•భన్ వినిపింపఁడె మీకు నెల్ల న
ర్జునుభుజవైభవంబు మధు•సూదను పెంపును నాఁడ ద్రోణశాం
తనవులుఁ జెప్పరే బహువి•ధంబుల వారల గెల్వ రామి మున్
వినమె యెఱింగియున్ మఱియు • వీఱిడిమాటలు వేయు నేటికిన్

క. ఒంటిమెయిఁ దాఁక నాము
క్కంటికి వశ మగునె కృష్ణ•గాండీవుల ని
ట్లొంట యుడిగి తగురథికుల
జంటగొని రణమ్ము సలుపు • శత్రులు దలఁకన్.

తే. గొంతికొడుకును దేవకి•కొడుకు మనము
గనియెదము దినకరనిశా•కరులఁ బోలె
వెలుఁగ నయ్యెడ ఖద్యోత•విలసితంబు
తోడి దగుఁ గాక నీపెంపు • దోఁపఁ గలదె?



వ. అనిన విని కర్ణుండు గమలనాభుని పెంపును బార్థు బలిమియు నెఱుంగక యే నేల వారిఁ దొడరెద నెట్లు సెప్పినను దొడరుదుఁ దొడరి వారొండె నేనొండె నగుదు నింతియ నీవు వెడమాట లాడక యుడుగు మని పలికి యచ్చటి మహీపతులు విన నమ్మద్రపతి కిట్లనియె.



## —* ధర్మజ దుర్యోధన సంవాదము *—

వ. జలాంతర్గతుండై యున్న దుర్యోధనునితో ధర్మరాజిట్లనియె.

చ. ఇటు తగునే సుయోధన? మ•హీవలయంబున నిట్టిదైన్య మె
చ్చట వినఁ జూడఁ గల్గెనె య•సంఖ్యులు రాజులు నీకుఁ గాఁగ జ
చ్చుటయును బంధుమిత్రులు వి•శుద్ధచరిత్రులు పోర నట్లు ద్రుం
గుటయును జూచి తేమిటికిఁ • గ్రుంకితి నీళ్లను జావు దప్పునే?

ఉ. శూరుఁడ వంద్రు నిన్ మడువు • సొచ్చుట శౌర్యము చొప్పె?
మాన మే! యూరికిఁ బోయె నాజి నృపులోడుదురే నృపుఁ
డన్న మాత్రయే! కౌరవవంశజాతుఁడవు • గప్పుఁ జచ్చుట
దెచ్చుకొంటి నీ! పేరును బెంపుమాలి యరి•బృందము నవ్వఁగ
నిట్లు సేయుదే?

తే. క్షత్త్రధర్మంబు విడిచినఁ • గలదె యిహముఁ
బరముఁ బేరోలగంబునఁ • బలుకు పలుకు
లెల్ల ఘటచితె విను మని • పొల్లులైనఁ
గష్టపాటు గాకును తేల • గావ వచ్చు?

చ. కొడుకులుఁ దమ్ములుం గలన ♦ ఘోరపుఁ జావులు సావ జూచి
యెట్లోడఁబడెనీదుబుద్ధి యొడ ♦ లోముటకై నిను రాజరాజ యి
మ్మడువునకీడ్చి తెచ్చె విధి ♦ మానము ప్రాణముకంబె జాలనె
క్కుడగుటసెప్పఁగా వినవొ ♦ కో కడు నీచతఁ బొందితక్కటా!

శా. అంభోగర్భముసొచ్చి పాండుసుతబా ♦ హాగర్వదుర్వారసం
రంభం బోర్వక డాఁగియుండెనట రా ♦ రా జిస్సిరో చచ్చుచో
గాంభీర్యంబును ధైర్యముం విడిచి దో ♦ర్గర్వంబు బెండయ్యెనే
శుంభన్మానము దూలెఁ గాకని జనస్తోమంబు నిందింపదే!

తే. కర్ణశకునిదుశ్శాసనుల్ ♦ ఘనులు గాఁగఁ
దలఁచివారలఁ గొని మమ్ము ♦ గెలుచువాఁడ
వై మనఁబున శంకింప ♦ కట్లు కీడు
చేసి తాపూఁవు దప్పిన ♦ గాసి నైతి.

వ. నీకొలంది గంటి మగపడితి వింక నెందుఁ బోవచ్చు
నని మఱియు నిట్లనియె.

మ. భయముం బాయఁగఁ ద్రోచి వీరగుణముం ♦ బాటించి సంగ్రా
మనిశ్చయబుద్ధిం దలకొల్పి పౌరుషముమైఁ ♦ జావొండె గె
ల్పొండెఁగాక యధీరత్వము నాకు నీకు యనివీఁ ♦ కం బేర్చి వే తాఁ
కి మోహితయుఁ బేరయ్యెడు రమ్ము లెమ్ము దిగినన్ ♦ దైన్యమ్ము
వచ్చుం జుమీ.

చ. అని మమ నోర్చినం బృథివి ♦ యంతయు నేలఁగవచ్చు లేక చ
చ్చిన సురసద్మసౌఖ్యములు ♦ చేకుఱు రెండు దెఱంగులందు నొ
ప్పనియది లేదు డాఁగనగు ♦ బాటును బ్రాణము చేటుఁ దెచ్చుకోల్
విను మమునీవెదుర్పఁ దగు ♦ వేయువిధంబులఁ జాటిచెప్పెదన్.



వ. తెంపు చేసి మామీఁద నుఱుకుట నీకు ధాత
నిర్మించిన పరమధర్మంబు. పురుషుండ వైతేని దీని ననుష్ఠింపు
మనిన విని యవ్వసుమతీశునకు సుయోధనుం డిట్లనియె.

సీ. నరుఁడు ప్రాణభయంబుఁ ♦ బొరయుట యరుదయ్య
వినుము తెల్లంబుగా ♦ మనుజనాథ
రథవాహసారథి ♦ రహితుండ నగుటను
బాణాదిహేతిసం ♦ పదలు లేమిఁ
బరివారశూన్యత ♦ వాటిల్లుటను బంధు
మిత్రసహాయులు ♦ మిడి యడంగఁ
జచ్చుటఁ బోటుల ♦ నొచ్చి మేనును డప్పి
గూరి చిత్తంబును ♦ బోరి కెలయ

తే. కునికిఁ జేసియుఁ దొలఁగితి ♦ నొదిఁగి సేద
దేర్చుకొని రణమునకు ను ♦ దీర్ణవృత్తి
వచ్చువాడను నీవు మీ ♦ వారు విశ్ర
మింపు డంతకు మఱేరండు ♦ సొంపు సూప.

వ. అని పలికినఁ బాండవాగ్రజుండు.

క. ఇంచుక విశ్రమించితి
మిందు నినుం దడవి కంటి ♦ మిప్పు డిచట నీ
కుం దేఱె డప్పి కురుపతి
నందన రమ్మింక రణము ♦ నకు నాయితమై

వ. అనుటయు.

తే. ఎవ్వరికిఁ గాఁగ రాజ్యంబు ♦ నెల్లభోగ
ములును గోరెదు రక్కుమా♦రులును నాదు

తమ్ములును లేరు తురగర♦థద్విపప్ర
హీన యయ్యె నీక్షోణియు ♦ నేల పెనఁగ.

చ. ద్రుపదతనూజులన్ గెలిచి ♦ దోర్బలసంపద నుల్లసిల్లి మి
మ్మపజితదర్పహీను లగు ♦ నట్లుగఁ జేసి సమస్తభూపతి
త్వపదము గంటి నేనియు వృ♦థారభసం బది యుండ్ర గాదు క
ర్ణపడుట భీష్ము లేమి నిగు♦రుండు మృతుండగుటన్ ధరాధిపా.

క. తనవారుఁ దానుఁ గూడఁగ
ననుభవసుఖ మందఁ డేని ♦ యది రాజ్యమె రా
జునకు భవత్పరిజనములు
ననుజన్ములు బ్రదికి రేలు ♦ మఖిలధరిత్రిన్.

క. ఏ నింక సమర మొల్లమ
హీనాయక నీక యుర్వి ♦ నిచ్చితి శాంతిం
గానకుఁ జని వల్కలపరి
ధానుఁడ నై తప మొనర్చె ♦ దను మునులకడన్.

ఆ. ఓడి వచ్చినాఁడ ♦ నుద్ధతి నాకేల
యుడుకు మాని నీవ ♦ యుర్వి యేలు
గుఱ్ఱములును నేనుఁ ♦ గఁలు లేనిబయలు నీ
తలనె కట్టికొనుము ♦ ధర్మతనయ!

చ. అన విని యన్నరేశ్వరుఁడు ♦ హాసముతో నతనిం గుఱించి యి
ట్లనుఁ దనుజానుజన్మసుహృ♦దాప్తసహాయులు సన్నఁ గాదె శ
ల్యుని గొని మమ్ము గెల్చి సక♦లోర్వియు నేలుట కుత్సహించితి
పనువుట లేల మానుమిది ♦ పాటిగఁ బట్టుము లెమ్ము పోరికిన్.



సీ. నీయాగి నేను భూ ♦ నాయకుఁ డగు టొల్ల
రాజకోటికిఁ బరి ♦ గ్రహము సనునె
నిను ననిం దెగటార్చి ♦ నేలఁ బాలించెద
నను నోర్చితేని పెం ♦ పున సుఖింపు
మేమిటివాఁడ వై ♦ యిచ్చితిపుడమి నీ
కనియెడుమాట యి ♦ ట్లాడె దిపుడు
నీవు ధరిత్రి యీ ♦ నేర్చినఁ గురుకులం
బునకు నిట్లాఱడిఁ ♦ బోవ నేల

తే. శాంతి నొందుటకై ధర్మ ♦ సంవిభాగ
కరణ మొనరింప వచ్చిన ♦ కమలనాభు
వాక్యస్ఫూర్తిఁ బాటింపక ♦ వాఁడిసూది
మోపినంతైన నుర్వి యీ ♦ నోప నంటి.

క. ఏమివిధంబునఁ బోరలియు
భూమి కురునృపాల నీకుఁ ♦ బుచ్చుకొనఁగ రా
కీమెయి దైన్యపడితి నా
కేమార్గము వట్టి యిచ్చె ♦ దేర్పడఁ జెప్పుమా.

క. అరులకు సిరి యిచ్చెద నను
వెరవిఁడియుం గలఁడె దీని ♦ విడువుము నాకున్
ధర యిచ్చితేనియును నినుఁ
బోరిఁ గొన కే విడువ నటేమి ♦ పోరుట యొప్పున్.

క. నాచే నీప్రాణంబులు
నీచే నాజీవితంబు ♦ నిజ మున్నవి యి

స్నిచిత యపకార్యము రా
జోచితకర్మకృతనిశ్చ • యుఁడ వగుము నృపా!

వ. అని వెండియు నిట్లను జతుగృహంబు దహించితి పాములం గఱపించితి నీటం ద్రోయించితి విషాన్నంబు వెట్టించితి వెన్ని కపటోపాయంబులు సేసినను నీచేతఁ జెడక యునికి యెఱుంగవే ఇంక నట్లు యిమ్మాయలం బ్రయోజనంబు లేదు.

క. లేలెమ్ము విరుద్ధవైర
హమ్ములమునకు నీవు నెఱుఁగు • దవ్విధము కడుఁ
నే లొందు తెరువు లేదిం
కేల యొదిఁగి కష్టపడ న • రేశ్వర చెపుమా.

వ. అని యివ్విధంబున నమ్మనుజేంద్రుండు మఱియుం బలుకఁ బెఱవాఱు నట్లు పలికిరనిన విని ధృతరాష్ట్రుండు.

తే. ఇట్లు జంకింపఁబడి మఱి • యేమి సేసె
నాతనూజుండు మున్ను నె • న్నఁడును జంకఁ
బడినవాఁడుగాఁ డక్కట • పుడమినాల్గు
సెఱఁగులును వెఱఁ దనపంపు • సేయఁబ్రిదికె.

క. పరిజనహీనత దీనతఁ
బొరసినయెడ ముట్టుకొని రిపుప్రకరము ని
ష్ఠురవాక్యమ్ముల నమ్మెఱఁగాఁ
బరితాపము సేయ నేమి • భంగి నిలిచెనో.

వ. అనుటయు సంజయుం డమ్మనుజపతి కిట్లనియె నట్లు ధర్మతనయుండును దమ్ములుఁ గొడుకులును ద్రుపద



పుత్రులును బొదువుకొని పలుకుపలుకులకుఁ జిత్తంబు త్తలపడ నాననంబు పల్లటిల్లఁ గరంబులు విదిర్చి దూరం బొనర్చువాఁడై యప్పాండవాగ్రజున కిట్లనియె.

సీ. మీ రేవురును బరి • వారబాంధవమిత్ర
సహితుల రఖిలాస్త్ర • శస్త్రవంతు
లరు కరిస్యందన • తురగసమేతుల
రే నొకరుండ వి • హీనసహచ
రత్వంబు విగతాయు • ధత్వంబు వాహన
హీనత నొందితి • నేవిధమున
నని యొనర్పఁగ వచ్చు • నదిగాక పోటుల
డస్సితిఁ గడు మీకు • దప్పి లేదు

తే. వరుసఁ దగ నొక్కఁడొక్కఁడ • వచ్చి పోరుఁ
డిపుడ వెడలి మిమ్మందఱ • నెల్లచెలులఁ
జుట్టముల రూపుమాపెదఁ • జుట్టుముట్టి
పలువు రొక్కనితోఁ బోరఁ • బాడియగునె?

వ. అట్టు మీరు సాలరేని.

ఉ. తమ్ముల నిన్నుఁ గేశవుని • తమ్ముని ద్రౌపదియన్న దమ్ము
లం । గ్రమ్మన గీటడంచెద నొ • కండన యేనిదె వచ్చి
బాహుద । ర్పమ్ముల నిర్గవారమును • భానుఁడు దోఁచి
సముజ్జ్వలాత్మతే । జమ్మున రూపుమాపుక్రియఁ • సజ్జత
నిల్వుము సుస్థిరుండవై.

తే. వినుము నీకుఁ గృష్ణునకును • వెఱచి కాదు
ముందరే నట్టు లాడుట • యొందుఁ జెల్లు

సమరధర్మంబు తెఱఁగు దే ♦ ల్లముగ నెల్ల
వారలకుఁ దెల్పుటకుఁగాని ♦ వసుమతీశ.

వ. నేఁడు మిమ్మందఱ సమయించి భీష్మద్రోణకర్ణ భగదత్త బాహ్లికజయద్రథశకుని శల్యాదు లగుబంధుమిత్ర సహాయులఋణంబు దీర్చెద నని పలికినం బాండవాగ్రజుం డిట్లనియె.

చ. సమరము పాడినీ వెఱిఁగి ♦ శత్రుల గెల్వఁగ నుత్సహించు
టో । ప్పు మనుజనాథ యొక్కఁడును ♦ బూని మహోద్ధృ
తబాహుసంపదన్ । మను వడిఁ దాఁకెనం బిలుకు ♦ మార్చె
ద నంట యుదాత్తమైనధై । ర్యమహిమ గాదె యిట్లనిన
యంతన యే నటు లేల చేసెదన్.

చ. వలసినయస్త్రశస్త్రములు ♦ వాహనముం గొను మొక్కరుండ
నిన్ । గలన జయించువాఁ డతని ♦ గర్వము నీ వడంగించి
తేని యీ । యిల సకలంబు గైకొని వహింపుము రాజ్య
విభూతి వాఁడు నిన్ । దలపడి పోరఁ జొట్టలును ♦ దక్కటి
వారలు నిల్చి చూడఁగన్.

వ. అనిన విని భవన్నందనుండు ధర్మనందనున కిట్లనియె.

చ. అరదము లెక్కి ఘోరవివి ♦ ధాస్త్రచయంబుల మున్ను
పోరమే । నరవర క్రొత్తచందము ర♦ణంబు కరంబు ప్రియం
బు సేయు ని । ష్ఠురగదలం బదాతు లయి ♦ శూరతయున్
మహనీయధీరతా । స్ఫురణమునుం బొగడ్త వడఁ ♦ బోరుట
మే లని నిశ్చయించితిన్.



తే. వింతకూరలు గుడుపున ♦ వేడ్క సేయు
భంగి సంగ్రామమున నూత్న ♦ భంగు లెడఁదఁ
గౌతుకము సేయుఁ గావున ♦ గద ధరించి
నిను సహోదరులను యోధు ♦ లను జయింతు.

చ. అనుటయుఁ బొంగి ధర్మసుతుఁ ♦ డాతనితో గద నొక్క
రుండ నేఁ । గొనియెద నీదు ప్రాణము ల♦ కుంఠితబాహు
విలాసభాసి నై । యనవుడుఁ బుట్టలోపలి మ♦హాభుజగేం
ద్రుఁడు రోఁజునట్లు రోఁ । జె నధిప యవ్విభుండు దన♦ చిత్త
ము నప్పలుకుల్ గలంచినన్.

వ. అట్లు నిశ్వాసంబు నిగుడ నొడలు పొంగఁ బటుకశాఘాతంబునం గెరలు శూకలాశ్వంబు చందంబునఁ గెరలి జలస్తంభం బుడిపికొని మడువు సంక్షోభింప నపహసితశిలాసారోదారంబును గనకపట్టికామండితంబును నైనగదాదండంబు విపులాంసపీఠంబున నమర్చుకొని వెడలె.

# III

# ఎఱ్ఱాప్రగడ (భారతము)

## —• సీతాన్వేషణము •—

వ. శ్రీరాముండు తనతమ్ముండగు లక్ష్మణుం జూచి యిట్లనియె.

సీ. చూచితే లక్ష్మణ • సుగ్రీవుకొఱగామి
యమ్మెయిఁ దనపగ • యడఁచి మనము
కపిరాజ్య మిచ్చినఁ • గైకొని యింద్రియ
సుఖముల నెంతయుఁ • జొక్కి నేఁడు
మనదిక్కు దలఁపడు • మనతోడఁ బల్కిన
సమయంబుఁ జెల్లింపఁ • జనదె తనకుఁ
గడుఁ గృతఘ్నత సేసెఁ • గపికులాధముఁడు నీ
వనఘ కిష్కింధకు • నరుగు మిపుడ

ఆ. యద్దురాత్ముఁ గృపణు • నాత్మీయకార్యత
త్పరుని నధికరాగ • పరవశాత్ముఁ
దోడరి వాలి చనిన • త్రోవనే యనిచి ర
మ్మేల తడయ మనకు • నింక నిచట.

ఆ. నీవు సనకమున్న • నెఱితోడ మనకార్య
మునకుఁ దగినయత్న • ములు ఘటించి
యుండెనేని వాని • నొం డేమియుం జేయ
వలదు తోడితెమ్ము • వార్యశౌర్య



చ. అనుడుఁ దదాజ్ఞఁ బూని యతఁ • డాతతకార్ముకహస్తుఁ
డై రయం । బునఁ జనియెం గపీశ్వరుని • ప్రోలికి వాఁడును
సంభ్రమంబుతో । నసుఁగులు దాను రాజసుత • నర్థి
నెదుర్కొని మ్రొక్కి యర్ఘ్యపూ । జన మొరించుడుఁ
విభుని • శాసన మాతఁడు సెప్పె వానికిన్.

వ. చెప్పిన విని భయకంపితగాత్రుం డగుచుఁ గమలమిత్త్రపుత్త్రుండు సుమిత్త్రాపుత్త్రున కిట్లనియె; నయ్యా యే నేల కృతఘ్నుండ నగుదు; జానకి నన్వేషించుటకునై బలవంతులు బుద్ధిమంతులు నగువానరులు ననేకుల నలుదెసలకుం బనిచితి. వారును సకలవనశైల సాగరగ్రామ నదీసహితంబైన భూచక్రంబునందెల్ల రోసి యొక్కమాసంబులోనం గ్రమ్మఱి వచ్చువారై సమయంబు సేసి పోయి రింక నైదుదినంబులు గొఱంత; యింతియ; యటమీఁద వైదేహీవార్త గొనుచు దేవరం గొలువ వచ్చువాఁడ నై యున్నవాఁడ ననినం బ్రీతుండై లక్ష్మణుండు.

క. వానిం దోడ్కొని చని యా
భూనాథునిఁ గానిపించి • పొందుగఁ దత్కా
ర్యానుష్ఠాన విశేషము
దా నెఱిఁగించుటయు విభుఁడు • ప్రద్దయు నలరెన్.

వ. పదంపడి కొన్నిదివసంబులకుఁ బూర్వపశ్చిమోత్తరదిక్కులకుం జనినవనచరు లరుగుదెంచి రాఘవుంగని దేవా సకలసాగరమేఖలావలయితంబైన భూవలయంబంతయు వెద

కితివి: మీఁదేవిం బొడగానమని చెప్పిన నతండు దుఃఖితుండయి దక్షిణదిశకుఁ బోయిన వానరులవలన వైదేహి తెలియంగలుంగుదు ననునాసంజేసి ప్రాణంబులు ధరియించియుండె; నంత వెండియు నొక్కమాసంబు సెల్లిన నతండు దుఃఖితుండై యుండఁ గొందఱు వనచరులు పఱతెంచి సుగ్రీవుం గని యిట్లనిరి.

సీ. నీవును వాలియు ♦ నేఁడును నాఁడుఁ బ్రి
యంబునఁ బాటించు ♦ నాఁకతోఁట
మధువనంబదె నేఁడు ♦ మనయంగదుండును
హనుమంతుఁడును మొద ♦ లైనవారు
బలువిడిఁ జూఱాడి ♦ ఫలములానెదరు త
ద్రక్షకు లగుమమ్ము ♦ రయముమీఱ
భంగించి రనవుఁడు ♦ భానునందనుఁడాత్మ
నంగదప్రముఖులు ♦ యామ్యదిశకుఁ

తే. జనినవారలు గావున ♦ జనకపుత్త్రిఁ
గనిన యబ్బిది గాఁబోలుఁ ♦ గాకయిట్లు
సేయ వెఱవరె పతికార్య♦సిద్ధి సలుపు
జనుల కీచన వెందును ♦ జనునకాదె!

వ. అని యూహించి తత్ప్రకారంబు రఘుపతికిం జెప్పెనంత.

ఉ. తేనెలు గ్రోలి క్రోలికడుఁ ♦ దియ్యని కమ్మనిపండు లింపు
సొం। పూనఁగ నాని యాని పర♦పొందిన నీడలు మెచ్చి



మెచ్చి మం।దానిలశైత్య సౌరభస♦మగ్రతకుం గడుం
జొక్కిచొక్కి యు।ద్యానమునందు మారుతసు♦తప్ర
ముఖుల్ విహరించి తృప్తులై.

వ. అందఱుంగూడుకొని చని, సుగ్రీవలక్ష్మణసహితుండై యున్న జననాథుం గని దండప్రణామంబు సేసినంగాకుత్స్థకులప్రదీపకుండు వారలముఖవర్ణవిశేషంబు లుపలక్షించి సీతంగనిన వారకానిశ్చయించె నప్పుడత్యంత మతిమంతుండయిన హనుమంతుండు రాఘవునకుఁ గృతాంజలియై యిట్లనియె.

క. దేవిఁ బొడగంటి నేను ధ
రావల్లభ శైలసరి ద♦రణ్యనగరపా
రావారకలిత మగు వసు
ధావలయము వెదకి వెదకి ♦ దక్షిణపుదిశన్.

తే. అవధరింపుము దేవ మే ♦ మందఱమును
నేకముఖమునఁ దొలి తొలి ♦ యిందునందు
నరయుచునుబోయి యొక్కెడ ♦ నతివిశాల
మైన భూవివరము గంటి ♦ మద్భుతముగ.

వ. కని దానిం బ్రవేశించి నిరంతర తిమిర సంవృతంబును బహుకీటసంకులంబును నైన మార్గంబున ననేకయోజనంబులు సనునెడ ముందట నర్కప్రకాశంబైన పురంబు గానంబడియె నం దొక్కతాపసాంగన యుండి మమ్ము నాదరించి తనపేరు ప్రభావతి యనియును నప్పురంబు మయుని పురం బనియును జెప్పి మధురంబులయిన భక్ష్యభోజ్యంబు లొసంగినం

దృప్తులమై తదుపదిష్టమార్గంబున మహీవివరంబు నిర్గమించి సహ్యదర్దుర శైలంబులు గడచి మలయశైల శిఖరంబెక్కి.

స్రగ్ధ. లీలం గల్లోల భాగో ♦ ల్లిఖితగగనమై ♦ లీన నానాకు
లీర। వ్యాళోగ్ర గ్రాహమీనా♦వళుల నెసఁగి దు ♦ ర్వా
ర వారోఘ గంభీ। రాలంఘ్య ప్రాణవేగం ♦ బగుచు బ
హుతరా♦యామవిస్తారమై బి ♦ ట్టాలోకింపంగ నుగ్రం ♦
బగు జలనిధి నం ♦ తంతటం గంటి మంతన్.

క. కని యిది రత్నాకర మి
వ్వనినిధిసీమమునఁ గల్గుఁ ♦ వసుమతిలోనన్
జనకసుత వెదకి కానమ
చన దివ్వాగ్రాశి దాఁటి ♦ చన నెవ్వరికిన్.

ఉ. భూమితనూజఁ గాన మని ♦ పోయి రఘూద్వహుతోడఁ
జెప్ప య। బ్భూమిపుచిత్త మాతురతఁ ♦ బొందఁగఁ జే
యుట కంటెఁ జూడఁగా। నీమెయిఁ జావుమేల మన ♦ కేల
విచారము లింక నంచు నం। దేము గడంగి యందఱము ♦
నేకతమంబగు నిశ్చయంబుతోన్.

వ. అనశనవ్రతంబు సంకల్పించి నియతచిత్తుల మై యుండి రాఘవుకార్యార్థంబై తెగిన జటాయువు కృతార్థుఁడయ్యె. మనము నట్టి పుణ్యలోకంబువడయుదమని పలుకుచున్న యెడ.

క. గిరిశృంగతుంగవిగ్రహుఁ
డురుతరసత్త్వుఁడు విహంగ ♦ మోత్తముఁ డం దొ
క్కరుఁ డొయ్యన మాయున్నెడ
కరుదుఁగఁ జనుదెంచి విగళి♦తాశ్రుండగుచున్.



సీ. అయ్యలార జటాయు ♦ వని పల్కెదరు మీర
లెవ్వరు సెప్పరే ♦ యేను వాని
కగ్రజుండ ననూరు ♦ నాత్మజన్ముల మేము
సంపాతి నాపేరు ♦ సమ్మదమున
నేనును దమ్ముండు ♦ నినమండలమునకుఁ
జనువేడ్క నొకనాఁడు ♦ చదలి కెగసి
చనఁ జనఁ దీవ్రాంశు ♦ సంతాపమునఁ జేసి
కమరె నాఱెక్కలు ♦ గమరవయ్యె

తే. ననుజుపక్షమ్ము లే నిమ్మ♦హాచలమున
నాఁటఁగోలె నిచ్చటికి జ♦నంగ నేర
కున్నవాఁడ నాతమ్ముఁ డె ♦ ట్లున్నవాఁడొ
యెఱుఁగ నెఱిఁగింపరే నాకు ♦ నిష్టమెసఁగ

వ. అనిన నేమతనికి భవదీయవృత్తాంతంబును రావణుండు దేవిం గొనిపోవుటయుఁ దదర్థంబు రావణుతో జటాయువు సమరంబు సేసి యీల్గుటయుఁ జెప్పిన విని, దుఃఖితుండై సంపాతి యస్మదీయప్రవర్తనం బేర్పడ నడిగి మాకిట్లనియె.

ఉ. రావణు నేనెఱుంగుదుఁ బ♦రాక్రమదుస్సహుఁడన్నిశాచరుం
డీవనరాశిమధ్యమున ♦ నిచ్చటికిన్ శతయోజనంబులన్
భూవిదితంబు లంక యను♦ప్రోలు తదీయనివాసమచ్చటన్
భూవరు దేవిఁ గాననగుఁ♦బొండ రయుండు కృతప్రయత్నులై

క. అని యతఁడు పనిన నందఱ
మును సాగరతరణకార్య•మునకు నుపాయం
బొనరఁ దలపోయు నెడ నే
నని యుత్సాహంబు సేయఁడయ్యె నొకండున్.

మ. జననాథోత్తమ! యేను బూని భవదా•జ్ఞాలీలఁ జెల్వొంబు మ
జ్జనకుండైనసమీరదేవుకృపయున్ • సత్త్వోన్నతిం జేయఁగా
ఘనవాస్తుంగతరంగసంగతమహా•గ్రాహాగ్రహోత్యుగ్ర ద
ర్శన మై పేర్చుపయోధి దాఁటితి జనా•శ్చర్యైక సంపాదినై.

ఉ. ఆలవణాబ్ధిమధ్యమున • యందుఁ ద్రికూటనగంబు మీఁద ను
త్తాలవిశాలసాలమణి•ధామ సముజ్జ్వలమైన లంక యన్
ప్రోలి నిగంటి నెంతయు న•పూర్వము దద్విభవంబు దేవ య
చ్చో లలితాంగి నారసితిఁ • జొచ్చి యనేకవిచేష్టితంబులన్.

వ. అరసి యొక్కెడ రావణాంతఃపురం బయిన యశోక
**వనంబునందు.**

సీ. కన్నీరు జడిగొని • క్రిమ్మఁ బ్రాఁ కెక్కిన,
కమ్రకపోలభా•గములు గలిగి
యవశమై యొఱగిన • యంగవల్లిక పొంత
నున్న భూమీరుహం•బూఁత గాఁగ
వెడలు నిట్టూర్పుల•వేఁడిమిఁ బగిలిన
యధరపల్లవము గా•రాకుఁ బోలఁ
దలఁపులసందడి • దండడించిన తాల్మి
కదలు శిరఃకంప•గతుల బెరయ



ఆ. నున్నపుణ్యమూర్తి • నుత్తమసౌందర్య
నవనతాస్య నార్త•యైనదానిఁ
గని విదేహతనయఁ • గా నెఱింగితి నేను
హా! రఘుప్రవీర • యనుచు నడల.

క. వినయమున దేవిఁ జేరం
జని యభివాదనము సేసి • జానకి రఘునం
దనుదూత నేను మారుత
తనయుఁడ వానరుఁడ నిన్నుఁ • దడవ నిచటికిన్.

వ. అరుగుదెంచితి, రామలక్ష్మణు లత్యంతకుశలం
బున నున్నవారు; వానరేశ్వరుండయిన సుగ్రీవుండు వారితో
సఖ్యంబు సేసి తత్కార్యంబు దీర్పం బూనె నింక మసలక
నీహృదయేశ్వరుండు సనుదెంచు నూఱడిల్లుము.

క. రక్కసుఁడఁ గాను జుమ్మీ
నిక్కపువానరుఁడ నేను • నీమదిలోనం
దక్కు మనుమాన మనవుడు
నొక్కింత దలంచికొని స•ముత్సుక యగుచున్.

వ. అద్దేవి నాకిట్లనియె నన్నా నిన్నెఱింగితి నది
యెట్లనిన రామహితాన్వేషి యగు వాఁ డవింధ్యుం డను వృద్ధ
రాక్షసుండు మున్న యింతయుం ద్రిజటచేత నాకెఱింగించె;
నతని పలుకులు దప్పవు. రాఘవుండు సుగ్రీవసహాయుం డయి
యునికి గలిగినది గావున నింకఁ దడయక యవ్వీరవరుం డొ
డ్డొని వచ్చి నాకుం బ్రియంబు సేయుము; నీకుఁ గార్యసిద్ధి

యయ్యెడు మఱుగుమని తనశిరోభూషణంబయిన యీరత్నంబు మీకు నభిజ్ఞానార్థంబుగా నాచేతి కిచ్చి మణియుఁ జిత్రకూట చరితంబైన కృతకవాయసకథయునుం జెప్పిన నేను లంకా పురదాహంబు సేసి యిట దేవరకింతయు విన్నవింప వచ్చితి నని చెప్పి హనుమంతుండు జానకీహృదయంబు మూర్తిమంతం బైన పగిది నున్న యమ్మహామణిరాజచూడామణి నప్పగించిన.

ఆ. అమ్మనోజ్ఞరత్న • మక్కునఁ గదియించి
పులక లెగయఁ గొంత • ప్రొద్దు విభుఁడు
జానకీకుచాగ్ర•సంగమసుప్తుఁడై
నట్లు యుండె ముకుళి•తాక్షుఁ డగుచు.



# IV

## నాచన సోముఁడు (ఉత్తరహరివంశము)



— • సాత్యకి రాయబారము. • —

మ. మొగమోటంబున నీవు వారియెదుటన్ ముఖ్యంబుయుద్ధంబ
కాఁ దెగనాడన్ వెఱతేని సాత్యకి సబుద్ధికుండు నీతోన యే
గి గుణగ్రాహులుగాని తద్ధరణిభృత్కూటాంతరంగంబులం
బగుల న్వ్రచ్చుఁ గఠోరవీరవచనప్రాపప్రహారోద్ధతిన్.

వ. అని పలికి, సాత్యకిం గనుంగొని నీ వితనితోడ సాళ్వనగరంబునకు హయారోహణుండవై సన్నాహంబు మెఱసి యొక్కరుండవ చని మదీయవచనంబు లన్నియుఁ దద్రాజడింభుల యెదుటఁ బలికి కలను చెప్పి రమ్మని వీడుకొల్పిన.

ఉ. వేడ్కఁ బ్రణామపూర్వముగ విశ్వజగజ్జనకున్ జనార్దనున్
వీడ్కొని యాజనార్దనుఁడు వేగమ కూడఁగ రా నరాతులీ
మూర్కొమహోద్ధతిం జెనయమానశమాయనజోడుగ్రై దువుం
జూర్కిఁకి దోఁప శౌరియనుజుం డరిగెం దురగాధిరూఢుఁడై.

సీ. చనిసాళ్వపురము చొ•చ్చి నరేంద్రనందన
మందిరద్వారంబు • నందు హయము
నవతరించి జనార్ద•నాంతఃప్రవేశంబు
మున్నుగా వారికిఁ • దన్ను శౌరి
పుత్త్రెంచుటయుఁ జెప్పి • పుచ్చె నాతండట్లు
చేసి యర్హాసనా•సీనుఁడైన

పిదప రప్పించినఁ • బెంపుతో సాత్యకి
యాజనార్దనుఁ డున్న • యాసనంబు
తే. నందుఁ గూర్చున్నఁ దప్పక • హంసుఁడతని
యాననంబు విలోకించి • యామనోజ్ఞ
భీషణం బగు వేషంబు • బింబితావ
హిత్థరోషంబు గనుఁగొని • యిట్టులనియె.

మ. ఇతఁడే సాత్యకి యిమ్మహాభుజు బలే ఎల్లప్పుడుం జెప్పఁగా
శ్రుతి పర్వంబగు నేఁడు గంటిమిగదా శూరుండు ధీరుండు సు
వ్రతుఁడౌదార్యసమన్వితుం డఖిలశాస్త్రజ్ఞుండు శస్త్రక్రమా
ర్జితసారుండను మాటలన్ని యుఁదగుం జిత్తంబుదాత్తంబుగన్.

వ. అనుటయు జనార్దనుండు.

క. హరి దక్షిణభుజము సమి
ద్ధురంధరుడు నయవిహారదోహలి హరికిం
బరమాప్తుడు సకలకళా
పరిణతుఁ డీతం డలంతిపని వచ్చునటే?

వ. అనుటయు హంసుండు సాత్యకితో నిట్లనియె.

గీ. కంసవైరికిఁ గుశలమే? కామపాలు
నకుఁ బ్రమోదంబె? యాదవులకు సుఖంబె?
యుగ్రసేనుండు మొదలుగా నున్న సాత్వ
తులకు నెల్లను సేమమే? దురితదూర!

క. అనవుడు సాత్యకి మోమునఁ
గొనసాగని తెలివివొడమఁ గుశలము నీ చె



ప్పినవారి కెల్ల ననుటయు
ననియె జనార్దనునితోడ హంసుడు పిదపన్.

శా. కంటే శౌరి నతండు నీపలుకు లాకర్ణించెనే క్రమ్మఱన్
వింటే తద్వచనంబు చెప్పు మనుడు న్విప్రోత్తముం డిట్లనున్
గంటిన్ గంటి దయానిధిన్ గుణనిధిన్ గారుణ్యపాథోనిధిం
గంటి న్నమ్మికఁ దమ్మికంటిఁ గొలువం గంటిం గృతార్థుండనై.

చ. అవిరళరత్న నూత్నకనకాసనపూర్వ మహీధరంబుపై
నవవికచారవిందరుచి నవ్వెడుకన్నులచాయ చుక్కలన్ దివి
యల మాయఁ జేయ నలుదిక్కుల మొక్కుల పేర మోడ్పు
యాదవకరకైరవంబులఁ గతంబునగంటి మురారిభాస్కరున్.

సీ. ఉరము కౌస్తుభరత్న • ముదయాద్రితటమునఁ
బొడతెంచు కలువల•బోటు బోటు
శిరము కిరీటంబు • సురగిరి నెత్తాన
రాజిల్లు పగలింటి • రాజు రాజు
కటిపచ్చబట్టు ది•గ్దంతి కుంభస్థలిఁ
జూపట్టు రేయెండ • జోడుజోడు
చేతిశంఖంబు గర్జిత గ•జేంద్రము కేలఁ
బరఁగు వెన్నెలపూవు • బంతి బంతి

తే. నైయె కొలువులోనఁ దేజోమయంబు సేయ
మౌక్తికవితానమయ సభా•మండపమున
సత్యభామాసఖీ కటా•క్షముఁగములు
చూడఁగొనుచున్న దేవకీ•సుతునిఁ గంటి.

మ. కని యద్దేవునితోడ వేడబమునం గప్పంబు గార్యంబుగా
నను బుత్తెంచుటఁ జెప్ప నోడితి జగన్నాథుండు నీ విందు వ
చ్చినకార్యం బెఱిగింపు మన్న పిదపం జెప్పంగ నోరాడె న
వ్వనివా రెవ్వరు లేరు నాపలుకులన్ వాక్రువ్వ నిం కేటికిన్?

వ. ఏ నప్పురుషోత్తము నుప్పు గప్పం బడిగినప్పు డతం డెప్పుడెప్పు డప్పార్థివడింభద్వయంబుం జూతునో యెచటం దెగం జూతునో యనుచుండి వెండియుం గొండొక నవ్వి యవ్విభుండు నారదుతోడ మాటలాడుచు నామాటలయెడ ననాదరంబు చేసె; నవ్వాసుదేవుండు దుర్వాసుతో వినోదంబుగాఁ గొందఱు యతీశ్వరులకు వాదంబుచేయించి బ్రహ్మతత్త్వనిర్ణయంబునకు వెఱవక వారిచేత నుత్తరంబు లిప్పించుచునుండె నట్టియెడ నాతిలంపున.

గీ. ఆకట నేరనివారైరి హంసడిచికు
లేమిగా నిందు: బుత్తెంచిరే నిదేల
వచ్చి వీఱిడి నైతిని వాసుదేవుఁ
దేఱి చూడరాదని చాల దిగులు గుడిచి.

క. మానితిఁ బని యామాటలు
మాని తిరుగుఁ డింక మీరు మనమాటలకుం
బూని మఱుమాట లాడఁగ
శైనేయుఁడు వచ్చెఁ దాన చాలుం బనికిన్.

క. అనుటయు హంసుఁడు గమగమఁ
గనలి మదిం జెలువు విడిచి కాలువఁ బొగడం



జనునే వీనికి నని యి
ట్లను ననుమానింప కాజనార్దనుతోడన్.

శా. ఓరీ బ్రాహ్మణధూర్త! నాయెదుర నోహో సాహసం
బెట్టిదో। వైరింగోరి నుతించుమాట లెటుగా వచ్చెం గృత
ఘ్నా యిదిన్। నోరే యొవ్వరి కెవ్వ రయ్యెదరు నిన్నుం
బెంచి మన్నించినన్। గారా మై యిటు చేసితే తొలఁగు
మింకం జాలు నీకార్యముల్.

మ. నిను రప్పింపక మున్న వేగపడి పూనెన్ శార్ఙ్గకౌమోదకీ
వనమాలాంబుజ చక్రభూమికలు గైవారంబు చేయించె నే
లిననాగారుల చేత యాదవుల నోలిం గొల్చి కూర్చుండఁగాఁ
బనిచెం గేశవుఁ డైంద్రజాలికుగతిం బ్రాంతయ్యె నీకంతటన్.

చ. పిఱికివి గాక నీవు నొకపెద్దవె సభ లుండుభంగి ము
న్నెఱుఁగనివాఁడవై బ్రమసి యెవ్వరిముందట నేమిమాటలో
యఱచితి వారిజం కెనల కచ్చుటఁ ద్రోపడి వచ్చితిచ్చటం।
గఱవఁగ వచ్చునే బలిమి గాడిదకుం బులితోలు గప్పినన్.

శా. నాకీతమ్ముఁడు ఖడ్గముం గలుగఁ గా నాకేశుఁడున్ సాటియే।
లోకంబు ల్పదునాలుగున్ గెలుతుఁ గల్లోలానిలాలోల వే
లాకూపారము పారముం గదియఁ జేయంజాలినన్ ద్వారకం
గైకొంచున్ యదువృష్ణిభోజ నృపసంఘధ్వంసనాపాదినై.

క. మాపట్టణమున నుండక
పో పో నినుఁ జంపరాదు పొత్తులవాఁడై

భూపాలకు సిరి మ్రింగితి
పాపాత్మ చుట్టమైతి పగవారలకున్.

వ. అనిపలికి సాత్యకిం గనుంగొని.

గీ. ఓరి యాదవ! కష్టాత్మ యొక్కరుండ
విచ్చటికి నీవు వచ్చుట యేమిచంద
మే మనియె నందసుతుఁడు నన్నెఱిఁగి యెఱిఁగి
కప్పమిప్పుడు నాకీని కారణంబు.

వ. అనుటయు సాత్యకి యిట్లనియె.

శా. ఆలోకించెదు శార్ఙ్గముక్తపటుబాణౌఘంబుచే నీమొనల్
నేలం గూలఁ గపాలపాలికలలో నిండారు రక్తంబులం
గ్రోలం గేలఁ బిశాచబాలికలు గైకొన్న మ్రణిశ్రేణితోఁ
గ్రాలం బట్టిన వెండికోరలగతిం గప్పంబు రెప్పంబుగాన్.

ఉ. తెచ్చెద మెల్లి నేడు మముఁ దెండనిపంచిన యుప్పుడాకినుల్
మచ్చరికంబునం జవులమర్చుటకై డిచికుండు నీవునుం
జొచ్చినచోటఁ బొచ్చి రణశూరుఁడు శౌరి కరాసిధారచే
బచ్చడిచేయఁగా జముని బానసముం బురుడించు చోటికిన్.

శా. ఆకంసాసురభంజనుం గినియఁ జేయం జాలు నీజిహ్వ హం
సా! శ్రీయం గలవాఁడ నిత్తు నది హస్తప్రాప్తిగా భూవరా
నీకం బెల్లఁ గనుంగొనంగ విచటన్ నీసొమ్ము నీ కిచ్చెదం
గా కే నంతటివాఁడనే తలఁచినం గప్పంబుఁ దెప్పింపఁగాన్.



ఉ. మేడ్పడి రాజ్యగర్వమున మీఁదు తలంపవుగాక చిద్పులుం
గాడ్పులుఁ గూడినట్లు మురఘస్మరుచేతుల శంఖశార్ఙ్గముల్
వీడ్పడి మ్రోయడాయఁబడి వేవురుజోదులసింహనాదముల్
దోడ్పడ వేరసాతఁలముదూఱియుమిన్నులమీఁదబాఱియున్.

వ. వా రెవ్వరంటేని వినుము.

సీ. హలపాణి ప్రథముఁ డాహవశాలి సాత్యకి
నేను రెండవవాఁడ ♦ నిట్టివాఁడ
మొగజోదుఁ గృతవర్మ ♦ మూఁడవవాఁడు నా
లవవాఁడు నిశరుఁ డుల్లఁజపు బిరుదు
శంభుఁ డేనవవాఁడు ♦ ఘన విక్రమాఢ్యుండు
వివిధుఁ డాఱవవాఁడు ♦ విజయధనుఁడు
వివిధాస్త్రనిపుణుఁ డేఁడవవాఁడు గజుఁడ య
ష్టముఁడు సారంగుఁ డుత్సాహశీలి

గీ. నవముఁడు విదూరదుండు సన్నాహమహితుఁ
డుద్ధవుండు దశముఁ డింక ♦ నున్నవారి
నెన్నఁ గోలఁదిగా దిట్లౌట ♦ యెఱిఁగి కృష్ణు
వెదకితి పరున్న పులిఁ గోలఁ ద్రవ్వేసినట్టు.

క. హరితనయు లిరువురను మీ
యిరువురకును ముందు కప్ప మెవ్వని కెవ్వం
డరువఁ గలఁవాడు వెఱ్ఱీ!
సురపతిగతిఁ బాసి రాజసూయము గలదే?

వ. ఇంకం గార్యంబు పరువంబు దప్పె; సంగరంబ పరి
పక్వం బైనయది వినుము.

క. దురమునకు న్మథురయుఁ బు
ష్కరముఁ బ్రయాగంబుఁ దగినకలఁకులు మీ కే
దుర వగు నది గొనుమనె హరి
యుర వగు గోవర్ధనంబు నేన యొసఁగెదన్.

వ. అనుటయుం గనుఁగవం గినుక నిక్క నక్కుమార యుగళంబు గిటగిటాయమానదంతంబును జటులభ్రుకుటివికట నిటలంబును నిబిడ దీర్ఘతరనిశ్శ్వాసంబును నిష్పేషణ భీషణకర తలంబును నిర్గళితఘర్మజలకణకలుషిత కపోలంబును నగుచు నవుడు గఱచి యిట్లున్న భంగిన పగఱం బరిమార్తు ననుచుండె నప్పుడు హంసుండు సాత్యకితో నిట్లనియె.

ఉ. ఓరి దురాత్మ! నీకుఁ దెగ నోల్లక యుండుట నీపరాక్రమం
బారసి కాదు రా వెఱవ కాడుము దూత యవధ్యుఁడెందు నీ
వీరుల నిన్ను సమ్మెటనె వ్రేయుదు డాయుదుఁ బోరశౌరికిన్
సీరికి బాహుసార మెడ సేయుదుఁ జేయుదు రాజసూయమున్

మ. వినురా సాత్యకి మాట లేమిటికి రా వేదండకోదండకే
తనసంకేత నరేంద్ర నూతనబలోదగ్రంబుగా మోహరింప
నవశ్యంబును వత్తుఁ బుష్కర సరఃపార్శ్వంబునం దెల్లి గొల్లైన
లెత్తింతు విరోధు లంబునిధి వెల్లిం డొల్లఁ జల్లింపఁగన్.

వ. అనుటయు డిచికుండు.



చ. విడువిడుమంచు నామొనల వీరులు పోరులఁ గోరుచున్న వా
రెడపడకుండ మిమ్మిచట నెన్నితి కొందఱ సిగ్గు గాదటే
గొడుగులు దప్పఁ బట్టినను గోటగ నేనుఁగు లెత్తు వెట్టినన్
బడుగులు మీరు చూడ హరిపాపటపై నడిదంబు వెట్టుదున్.

వ. అనుటయు సాత్యకి కోపించి.

చ. కడఁగితి దూత్యము న్నడపఁ గాన సహింపక పోదుగాక నా
కడిదము చేత నుండగ మురారి విరోధులఁ బట్టి పూవునుం
దొడిమయుఁ జూపకున్న నది ద్రోహము పందెము వేసి తుం
డముల్ । దడఁబడకుండ మిమ్ముఁ బెడఘారన వ్రేయుదు
నేమి చేయుదున్.



# V

# బమ్మెర పోతనామాత్యుఁడు (భాగవతము)

—* అవతారిక *—

శ్రీ కైవల్యపదంబుఁ జేరుటకునై చింతించెదన్ లోకర
క్షైకారంభకు భక్తపాలనకళాసంరంభకున్ దానవో
ద్రేకస్తంభకుఁ గేళిలోలవిలసద్దృగ్జాలసంభూత నా
నాకంజాతభవాండకుంభకు మహానందాంగనాడింభకున్.

ఉ. వాలినభక్తి మ్రొక్కెద నవారితతాండవకేళికిన్ దయా
శాలికి శూలికిన్ శిఖరిజాముఖపద్మ మయూఖమాలికిన్
బాలశశాంకమౌళికిఁ గపాలికి మన్మథగర్వపర్వతో
న్మూలికి నారదాదిమునిముఖ్య మనస్సరసీరుహాలికిన్.

ఉ. ఆతతసేవఁ జేసెద సమస్త చరాచరభూతసృష్టి వి
జ్ఞాతకు భారతీహృదయసౌఖ్యవిధాతకు వేదరాశి ని
ర్ణేతకు దేవతానికరనేతకుఁ గల్మషజేతకున్ నత
త్రాతకు ధాతకున్ నిఖిలతాపసలోకశుభప్రదాతకున్.

వ. అని నిఖిలభువనప్రధాన దేవతావందనంబుఁ జేసి.

ఉ. ఆదర మొప్ప మ్రొక్కిడుదు నద్రిసుతాహృదయానురాగసం
పాదికి దోషభేదికిఁ బ్రపన్నవినోదికి విఘ్నవల్లికా
ఛేదికి మంజువాదికి నశేషజగజ్జననందవేదికిన్
మోదకఖాదికిన్ సమదమూషకసాదికి సుప్రసాదికిన్.



ఉ. క్షోణితలంబునన్ నుదురు సోఁకఁగ మ్రొక్కి నుతింతు సైకత
శ్రోణికిఁ జంచరీకచయసుందరవేణికి రక్షితామర
శ్రేణికిఁ దోయజాతభవచిత్త వశీకరణైక వాణికిన్
వాణికి నక్షదామ శుకవారిజ పుస్తకరమ్యపాణికిన్.

శా. పుట్టంబుట్టశరంబునన్ మొలవనంభోయానపాత్రంబునన్
నెట్టం గల్గను గాలిఁ గొల్వను బురాణింపన్ దొరంకొంటిమీఁ
దెట్టేవెంటఁ జరింతుఁ దత్సరణి నాకీవమ్మ యోయమ్మ మేల్
పట్టున్ నాకగుమమ్మ నమ్మితిఁ జుమీ బ్రాహ్మీ దయాంభోనిధీ.

ఉ. శారద నీరదేందు ఘనసారపటీర మరాళమల్లికా
హారతుషారఫేనరజతాచలకాశ ఫణీశ కుందమం
దారసుధాపయోధి సితతామరసామర వాహినీ శుభా
కారత నొప్పు నిన్ను మదిఁ గానఁగ నెన్నఁడు గల్గు భారతీ!

ఉ. అంబ నవాంబుజోజ్జ్వలకరాంబుజ శారదచంద్రచంద్రికా
డంబరచారుమూర్తి ప్రకటస్ఫుటభూషణరత్నదీపికా
చుంబిత దిగ్విభాగ శ్రుతిసూక్తి వివిక్త నిజప్రభావ భా
వాంబరవీథి విశ్రుతవిహారిణి! నన్ గృపఁ జూడు భారతీ!

ఉ. అమ్మలగన్నయమ్మ ముగురమ్మలమూలపుటమ్మ చాలఁ బె
ద్దమ్మ సురారులమ్మ కడు పాఱడిపుచ్చినయమ్మ దన్ను లో
నమ్మినవేల్పుటమ్మల మనమ్ముల నుండెడియమ్మ దుర్గ మా
యమ్మ కృపాబ్ధి యిచ్చుత మహత్త్వకవిత్వపటుత్వసంపదల్.

మ. హరికిం బట్టపుదేవి పున్నెములప్రోవర్థంపుఁ బెన్నిక్క చం
దురుతోఁబుట్టువు భారతీగిరిసుతల్ దోనాడు పూఁబోఁడి దా

మరలం దుండెడిముద్దరాలు జగముల్ మన్నించునిల్లాలు భా
సురతన్ లేములువాపుతల్లి సిరియిచ్చున్ నిత్యకల్యాణముల్.

వ. అని యిష్టదేవతలం జింతించి దినకరకుమారప్రముఖులం దలంచి ప్రథమకవితావిరచన విద్యావిలాసాతిరేకి వాల్మీకి నుతియించి హయగ్రీవదనుజకరపరిమిళిత నిగమనివహవిభాగనిర్ణయనిపుణతా సముల్లాసునకు, వ్యాసునకు మ్రొక్కి శ్రీమహాభాగవతకథాసుధారసప్రయోగికి శుకయోగికి నమస్కరించి మృదు మధుర వచనవర్గ పల్లవితస్థాణునకున్ బాణునకుం బ్రణమిల్లి కతిపయశ్లోకసమ్మోదిత సూరు మయూరు నభినందించి మహాకావ్యకరణ కళావిలాసుం గాళిదాసుం గొనియాడి కవికమలరవిన్ భారవిం బొగడి విదళితాఘు మాఘు వినుతించి యాంధ్రకవితా గౌరవజనమనోహరి నన్నయసూరిం గైవారంబు సేసి హరిహరచరణారవింద వందనాభిలాషిం దిక్కమనీషిన్ భూషించి మఱియు నితరపూర్వకవి జనసంభావనంబు గావించి వర్తమానకవులకుం బ్రియంబు వలికి భావికవుల బహూకరించి యుభయకావ్యకరణ దక్షుండనై.

ఉ. ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములుఁ గొన్ని పుచ్చుకొని చొక్కి శరీరము వాసి కాలుచే
సమ్మెటవ్రేటులం బడక సమ్మతితో హరికిచ్చి చెప్పె నీ
బమ్మెరపోతరా జొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్.

తే. చేతులారంగ శివునిఁ బూజింపఁడేని
నోరు నొవ్వంగ హరికీర్తి నుడువఁడేని



దయయు సత్యంబు లోనుగాఁ దలఁపఁడేని
గలుగ నేటికిఁ దల్లుల కడుపుఁ జేటు.

వ. అని మఱియు మదీయపూర్వజన్మ సహస్రసంచిత తపఃఫలంబున శ్రీమన్నారాయణకథా ప్రపంచవిరచనా కుతూహలుండనై యొక్క రాకా నిశాకాలంబున సోమోపరాగంబు రాకం గని సజ్జనానుమతంబున నభ్రంకష శుభ్రసముత్తుంగ భంగ యగు గంగకుం జని క్రుంకులిడి వెడలి మహనీయ మంజుల పులినతలంబున మహేశ్వరధ్యానంబు సేయుచుఁ గించి దున్మీలితలోచనుండనై యున్న యెడ.

సీ. మెఱుఁగు చెంగట నున్న మేఘంబు కైవడి
నువిద చెంగట నుండ నొప్పువాఁడు
చంద్రమండల సుధాసారంబుపోలిక
ముఖమునఁ జిఱునవ్వు మొలచువాఁడు
వల్లీయుత తమాలవసుమతీజముభంగి
బలువిల్లు మూపునఁ బరఁగువాఁడు
నీలనగాగ్రసన్నిహిత భానునిభంగి
ఘనకిరీటము దలఁ గలుగువాఁడు

ఆ. పుండరీకయుగముఁ బోలుకన్నులవాడు
వెడఁద యురమువాఁడు విపులభద్ర
మూర్తివాఁడు రాజముఖ్యుఁ డొక్కరుఁడు నా
కన్నుఁగవకు నెదురఁగానఁబడియె.

వ. ఏను నారాజశేఖరుం దేఱిచూచి భాషింప యత్నంబు సేయునెడ నతండు దా రామభద్రుండ మన్నామాంకితంబుగా శ్రీమహాభాగవతంబుఁ దెనుంగు సేయుము, నీకు భవబంధంబులు దెగునని యానతిచ్చి తిరోహితుం డయిన సమున్మీలిత నయనుండనై వెఱఁగు పడి చిత్తంబున,

క. పలికెడిది భాగవత మఁట
పలికించువిభుండు రామభద్రుండఁట నేఁ
బలికిన భవహరమగు నఁట
పలికెద వేఱొండుగాథ పలుకఁగ నేలా?

ఆ. భాగవతము దెలిసి పలుకుట చిత్రంబు
శూలికైనఁ దమ్మిచూలికైన
విబుధజనులవలన విన్నంత గన్నంత
దెలియ వచ్చినంత దేటపఱుతు.

క. కొందఱకుఁ దెనుఁగు గుణమగుఁ
గొందఱకును సంస్కృతంబు గుణమగు రెండుం
గొందఱకు గుణములగు నే
నందఱ మెప్పింతుఁ గృతుల నయ్యైయెడలన్.

మ. ఒనరన్ నన్నయతిక్కనాదికవు లీయుర్విం బురాణావళుల్
తెనుఁగుం జేయుచు మత్పురాకృతశుభాధిక్యంబు దానెట్టిదో
తెనుఁగుం జేయరు మున్ను భాగవతమున్ దీనిం దెనింగించి నా
జననంబున్ సఫలంబుఁ జేసెదఁ బునర్జన్మంబు లేకుండఁగన్.

మ. లలితస్కంధముగృష్ణమూలముశుకాలాపాభిరామంబు మం
జులతాశోభితమున్ సువర్ణసుమనస్సుజ్ఞేయమున్ సుందరో



జ్జ్వలవృత్తంబు మహాఫలంబు విమలవ్యాసాలవాలంబునై
వెలయున్ భాగవతాఖ్యకల్పతరు వుర్విన్ సద్ద్విజశ్రేయమై.

వ. ఇట్లు భాసిల్లెడు శ్రీమహాభాగవతపురాణ పారిజాతపాదప సమాశ్రయంబునను హరికరుణావిశేషంబునను గృతార్థత్వంబు సిద్ధించెనని బుద్ధి నెఱింగి లేచి మరలి కొన్ని దినంబులకు నేకశిలానగరంబునకుం జనుదెంచి యందు గురువృద్ధ బుధ బంధు జనానుజ్ఞాతుండనై.



— * అశ్వత్థామ గర్వాపహరణము * —

వ. అని పలికి కురుపాండవయుద్ధంబున వీరులైనవారలు స్వర్గంబునకుం జనినవెనుక భీముగదాఘాతంబున దుర్యోధనుండు దొడలు విఱిగి కూలిన నశ్వత్థామ దుర్యోధనునకుం బ్రియంబు సేయువాఁడై నిదురవోవు ద్రౌపదీపుత్త్రులశిరంబులు ఖండించి తెచ్చి సమర్పించె నది క్రూరకర్మంబని లోకులు నిందింతురు.

ఉ. బాలురచావు కర్ణములఁ బడ్డఁ గలంగి యలంగి యోరువం
జాలక బాష్పతోయకణజాలము సెక్కులరాల నేడ్చి పాం
చాలతనూజ నేలఁబడి జాలిఁ బడం గని యెత్తి మంజువా
చాలతఁ జూపుచుం జికురజాలము దువ్వుచుఁ గ్రీడి యిట్లనున్.

మ. ధరణీశాత్మజ నీవు నీకు వగవన్ ధర్మంబె యా ద్రౌణి ని
ష్కరుణుండై విదళించె బాలకుల మద్గాండీవనిర్ముక్తభీ

కరబాణంబుల నేఁడు వానిశిరమున్ ఖండించి నేఁ దెత్తుఁ ద
చ్ఛిరముం ద్రొక్కి జలంబులాడు మిచటన్ శీతాంశుబిం
బాననా!

వ. అని యిట్లొడంబఱిచి తనకు మిత్త్రుండును సారథియు నైన హరి మేలనుచుండ గవచంబు దొడిగి గాండీవంబు ధరియించి కపిధ్వజుండై గురుసుతునివెంట రథంబు దోలించిన.

శా. తన్నుం జంపెద నంచు వచ్చువిజయున్ దర్శించి తద్ద్రోణి
యా। పన్నుండై శిశుహంత గావున నిజప్రాణేచ్ఛఁ బాఱెన్
వడిన్ । మున్నా బ్రహ్మ మృగాకృతిం దనయకున్ మోహిం
చి క్రీడింపనా। సన్నుండై హరుఁ జూచి పాఱుపగిదిన్ సర్వేం
ద్రియభ్రాంతితోన్.

వ ఇట్లోపినంత దూరంబు బఱువిడి వెనుకఁ జూచి రథతురగంబు లలయుటఁ దెలిసి నిలిచి ప్రాణరక్షణంబునకు నొం డుపాయంబు లేమి నిశ్చయించి జలంబుల వార్చి ద్రోణనందనుండు సమాహితచిత్తుండై ప్రయోగంబ కాని యుపసంహారంబు నేరకయుఁ బ్రాణసంరక్షణార్థంబు పార్థునిమీఁద బ్రహ్మశిరోనామకాస్త్రంబుం బ్రయోగించిన నది ప్రచండ తేజంబున దిగంతరాళంబు నిండి ప్రాణిభయంకరంబై తోఁచిన హరికి నర్జునుం డిట్లనియె.

క. ఇది యొక తేజము భూమియుఁ
జదలును దిక్కులును నిండి సర్వంకషమై
యెదురై వచ్చుచు నున్నది
విదితముగా నెఱుఁగఁ జెప్పవే దేవేశా!



వ. అనిన హరి యిట్లనియె.

శా. జిహ్మత్వంబునఁ బాఱి ద్రోణజుఁడు దుశ్శీలుండు ప్రాణే
చ్ఛుఁడై । బ్రహ్మాస్త్రంబదె యేసె వచ్చె నిదె తద్బాణాగ్ని
భీభత్స నీ । బ్రహ్మాస్త్రంబునఁ గాని దీని మరలింపన్ రాదు
సంహార మీ । బ్రహ్మపత్య మెఱుంగఁ జేయుము వడిన్
బ్రహ్మాస్త్రమున్ దీనిపై.

వ. అనిన నర్జునుండు జలంబుల వార్చి హరికిం బ్రదక్షిణంబు వచ్చి ద్రోణనందనుం డేసిన బ్రహ్మాస్త్రంబు మీఁదఁ దన బ్రహ్మాస్త్రంబుం బ్రయోగించిన.

మ. అవని వ్యోమములందు నిండి తమలో నా రెండు బ్రహ్మా
స్త్రముల్ । రవివహ్నిద్యుతిఁ బోరుచుం ద్రిభువనత్రాసంబు
గావింపఁగా వివశభ్రాంతి యుగాంతమోయని ప్రజల్ వీ
క్షింప నావేళ మాధవునాజ్ఞన్ విజయుండు సేసె విశిఖద్వం
ద్వోపసంహారమున్.

వ. ఇట్లస్త్రద్వయంబు నుపసంహరించి ధనంజయుండు ద్రోణనందనుం గూడ నరిగి పట్టుకొని రోషారుణిత లోచనుండై యాజ్ఞికుండు రజ్జువులం బశువుఁ గట్టినచందంబున బంధించి శిబిరంబుకడకుం గొని చని హింసింతు నని తిగిచినం జూచి హరి యిట్లనియె.

ఉ. మాఱుపడంగ లేనియసమర్థుల సుప్తుల నస్త్రవిద్యలం
దేఱని పిన్నపాపల వధించె నిశీథమునందుఁ గ్రూరుఁడై

పాఱుఁడె వీఁడు పాతకుఁడు ప్రాణభయంబున వెచ్చనూ
ర్చుచుం బాఱెడివీనిఁ గావుము కృపామతి నర్జున పాపవర్జనా.

చ. వెఱచినవాని దైన్యమున వేఁదుఱు నొందినవాని నిద్రమై।
మఱచినవాని సౌఖ్యమున మద్యముఁ ద్రావినవాని భగ్నుఁ
డై।పఱచినవాని సాధుజనభావము వానిని గావుమంచు వా।
చఱచినవానిఁ గామినులఁ జంపుట ధర్మముగాదు ఫల్గునా!

శా. స్వప్రాణంబుల నెవ్వఁడేనిఁ గరుణాసంగంబు సాలించి య
న్యప్రాణంబులచేత రక్షణము సేయన్ వాఁ డధోలోకదుః
ఖప్రాప్తుం డగు రాజదండమున సత్కల్యాణుఁ డౌ నైన నీ
విప్రుం దండితుఁ జేయు మేటికి మహావిభ్రాంతిచే నుండఁగన్.

వ. అని యివ్విధంబునఁ గృష్ణుం డానతిచ్చిన బ్రాహ్మణుండు కృతాపరాధుండయ్యు వధ్యుండుగాఁ డనుధర్మంబుఁ దలంచి చంపక ద్రుపదరాజపుత్రికిం దన జేసిన ప్రతిజ్ఞం దలంచి బద్ధుండైనగురునందనుం దోడ్కొని కృష్ణుండు సారథ్యంబు సేయ శిబిరంబుకడకు వచ్చి.

క. సురరాజసుతుఁడు సూపెను
దురవధిసుతశోకయుతకు ద్రుపదుని సుతకుం
బరిచలితాంగశ్రేణిం
బరుషమహాపాశబద్ధ పాణిన్ ద్రౌణిన్.

వ. ఇట్లర్జునుండు దెచ్చిచూపిన బాలవధజనిత లజ్జాపరాఙ్ముఖుండైన కృపీనందనుం జూచి మ్రొక్కి సుస్వభావయగు ద్రౌపది యిట్లనియె.



మ. పరఁగన్ మామకవారలందఱును మున్ ప్రాణప్రయోగో
పసం।హారణాద్యాయుధవిద్య లన్నియును ద్రోణాచార్యు
చే నభ్యసిం।చిరి పుత్రాకృతి నున్న ద్రోణుఁడవు నీచిత్తం
బులో లేశముం। గరుణాసంగము లేక శిష్యసుతులన్
ఖండింపఁగా బాడియే?

క. భూసురుఁడవు బుద్ధిదయా
భాసురుఁడవు శుద్ధవీరభటసందోహా
గ్రేసరుఁడవు శిశుమారణ
మాసురకృత్యంబు ధర్మమగునే? తండ్రీ!

శా. ఉద్రేకంబున రారు శస్త్రధరులై యుద్ధావనిన్ లేరు కిం
చిద్ద్రోహంబును నీకుఁ జేయరు బలోత్సేకంబుతోఁ జీకటిన్
భద్రాకారులఁ బిన్నపాపల రణప్రౌఢక్రియాహీనులన్
నిద్రాసక్తుల సంహరింప నకటా నీచేతులెట్లాడెనో?

ఉ. అక్కట పుత్రశోకజనితాకుల భార విషణ్ణచిత్తనై
పొక్కుచు నున్న భంగి నినుఁ బోరఁ గిరీటి నిబద్ధుఁ జేసి నేఁ
డిక్కడ కీడ్చి తెచ్చుట సహింపని దై భవదీయమాత నేఁ
డెక్కడ నెట్టిశోకమున నేక్రియ నేడ్చుచు బొక్కుచున్నదో.

వ. అని కృష్ణార్జునులం జూచి యిట్లనియె.

ఉ. ద్రోణునితో శిఖింబడక ద్రోణకుటుంబిని యున్నదింట న
క్షీణతనూజశోక వివశీకృతనై విలపించుభంగి నీ

ద్రౌణిఁదెరల్చి తెచ్చుటకు దైన్యమునొందుచు నెంతపొక్కునో
ప్రాణవిముక్తుఁడైన నతిపాపము బ్రాహ్మణహింసమానరే!

క. భూపాలకులకు విప్రులఁ
గోపింపంచేయఁ దగదు కోపించినఁ ద
త్కోపానలంబు మొదలికి
భూపాలాటవులఁ గాల్చు భూకంపముగాన్.

వ. అని యిట్లు ధర్మ్యంబును సకరుణంబును నిర్వ్యళీకంబును సమంజసంబును శ్లాఘ్యంబునుంగాఁ బలుకు ద్రౌపదిపలుకులకు ధర్మనందనుండు సంతసిల్లె. నకుల సహదేవ సాత్యకి ధనంజయ కృష్ణులు సమ్మతించిరి; సమ్మతింపక భీముం డిట్లనియె.

చ. కొడుకులఁ బట్టిచంపెనని కోపమునొందదు బాలఘాతుకున్
విడువుమటంచుఁ జెప్పెడిని వెఱ్ఱిది ద్రౌపది వీడు విప్రుఁడే
విడువఁగనేల చంపుఁడిటు వీనిని మీరలు సంపరేని నా
పిడికిటిపోటునన్ శిరముభిన్నముసేసెదఁ జూడుఁడిందఱున్.

వ. అనిపలికిన నశ్వత్థామకు ద్రౌపది యడ్డంబువచ్చె; భీమునిసంరంభంబు సూచి హరి చతుర్భుజుండై రెండుచేతుల భీముని వారించి, కడమ రెంటను ద్రుపదపుత్రికను దలంగించి నగుచు భీమునకిట్లనియె.

ఉ. అవ్యుఁడుగాఁడు వీడు శిశుహంతదురాత్మకుఁడాతతాయిహం
తవ్యుఁడు బ్రహ్మబంధుఁడగుఁ దప్పదు నిక్కము బ్రాహ్మణోన
హన్తవ్య యటంచు వేదము శ్రుతంబగుఁగావున ధర్మదృష్టిఁగ
ర్తవ్యము వీనిఁగాచుట యథాస్థితిఁ జూడుము పాండవోత్తమా!



వ. అని సరసాలాపంబు లాడి పవననందను నొడంబఱిచి యర్జునుం జూచి ద్రౌపదికి నాకు భీమసేనునకు సమ్మతంబుగ మున్ను నీ చేసినప్రతిజ్ఞయు సిద్ధించునట్లు నాపంపు సేయు మని నారాయణుం డానతిచ్చిన, నర్జునుండును దదనుమతంబున.

శా. విశ్వస్తుత్యుఁడు శక్రసూనుఁడు మహావీరుండు ఘోరాసిచే
నశ్వత్థామశిరోజముల్ దఱిఁగి చూడాంతర్మహారత్నమున్
శశ్వత్కీర్తి వెలుంగఁ బుచ్చుకొని పాశవ్రాతబంధంబులన్
విశ్వాసంబున నూడ్చి త్రోచె శిబిరోర్వీభాగముం బాసిపోన్.

క. నిబ్బరపు బాలహంతయు
గొబ్బునఁ దేజంబు మణియుఁ గోల్పడి నతుఁడై
ప్రబ్బినవగచే విప్రుఁడు
సిబ్బితితో నొడలి గబ్బు సెడి వడిఁ జనియెన్.

ఆ. ధనముఁ గొనుట యొండెఁ దల గొరుగుట యొండె
నాలయంబు వెడల నడుచు టొండెఁ
గాని చంపఁదగినకర్మంబు సేసినఁ
జంపఁదగదు విప్రజాతిఁ బతికి.



—* శ్రీకృష్ణ నిర్యాణము, అర్జున విలాపము *—

క. ఖేదమున నింద్రసూనుఁడు
యాదవపురినుండి వచ్చి యగ్రజుఁ గని త

త్పాదకుల నయనసలిలో
త్పాదకుఁ డై పడియె దీనుభంగి నరేంద్రా!

క. పల్లటిలిన యుల్లముతోఁ
దల్లడపడుచున్న పిన్నతమ్మునిఁ గని వె
ల్వెల్ల నగుమొగముతో జను
లెల్లను విన ధర్మపుత్త్రుఁ డిట్లని పలికెన్.

సీ. మాతామహుం డైన మనశూరుఁ డున్నాఁడె
మంగళమే మనమాతులునకు
మోదమే నలుగురు ముగురు మేనత్తల
కానందమే వారియాత్మజులకు
సక్రూర కృతవర్మ లాయుస్సమేతులే
జీవితుఁడే యుగ్రసేనవిభుఁడు
కల్యాణయుక్తులే గదసారణాదులు
మాధవుతమ్ములు మానధనులు

తే. నందమే మనసత్యకనందనునకు
భద్రమే శంబరాసురభంజనునకుఁ
గుశలమే బాణదనుజేంద్రకూఁతుపతికి
హర్షమే పార్ధ ముసలికి హలికి బలికి.

వ. మఱియు నంధక మధు భోజ దశార్హ వృష్ణి సాత్వతులు మొదలయిన యదువంశవీరులును హరికుమారులైన సాంబసుషేణ ప్రముఖులును నారాయణానుచరులైన యుద్ధవాదులును



కృష్ణసహచరు లైన సునందనందాదులును సుఖానందులే యని యందఱ నడిగి ధర్మజుండు గ్రమ్మఱ ని ట్లనియె.

సీ. వైకుంఠవాసులవడుపున నెవ్వని
బలమున నానందభరితు లగుచు
వెఱవక యాదవవీరులు వర్తింతు
రమరులు గొలువుండునట్టి కొలువుఁ
జవికె నాకర్షించి చరణసేవకు లైన
బంధుమిత్త్రాదుల పాదయుగము
నెవ్వఁడు ద్రొక్కించె నింద్రపీఠముమీఁద
వజ్రంబు జళిపించి వ్రాలువాని

తే. ప్రాణవల్లభకెంగేలఁ బాదు సేసి
యమృతజలములఁ బోషింప నలరు పారి
జాత మెవ్వఁడు గొని వచ్చి సత్యభామ
కిచ్చె నట్టిమహాత్మున కిపుడు శుభమె?

శా. అన్నా ఫల్గున! భక్తవత్సలుఁడు బ్రహ్మణ్యుండు గోవిందుఁడా
పన్నానీకశరణ్యుఁ డీశుఁడు జగద్భద్రానుసంధాయి శ్రీ
మన్నవ్యాంబుజపత్త్రనేత్రుఁడు సుధర్మామధ్యపీఠంబునం
దున్నాఁడా బలభద్రుఁ గూడి సుఖియై యుత్సాహియై ద్వారకన్?

క. ఆరామకేశవులకును
సారామలభక్తి నీవు సలుపుదువు గదా
గారాములు సేయుదురా
పోరాముల బంధు లెల్లప్రొద్దు జితారీ!

శా. మున్ను గిరాటవిలోలవరాహము నకై ముక్కంటితో బోరుచో
సన్నాహంబునఁ గాలకేయుల ననిం జక్కాడుచోఁ బ్రాభవ
స్కన్నుండై చను కౌరవేంద్రుపనికై గంధర్వులం దోలు
చో గన్నీ రెన్నఁడుఁ దేవు తండ్రి చెపుమా కల్యాణమే చక్రికిన్

వ. అదియునుం గాక.

క. ఓడితివో శత్రువులకు
నాడితివో సాధుదూషణాలాపములం
గూడితివో పరసతులను
వీడితివో మానధనము వీరులనడుమన్.

క. తప్పితివో యిచ్చెద నని
చెప్పితివో కపటసాక్షి చేసిన మేలుం
దప్పితివో శరణార్థుల
రొప్పితివో ద్విజులఁ బసుల రోగుల సతులన్.

క. అడిచితివో భూసురులను
గుడిచితివో బాలవృద్ధగురువులు వెలిగా
విడిచితివో యాశ్రితులను
ముడిచితివో పరులవిత్తములు లోభమునన్.

వ. అనిపలికినం గన్నీరు కరతలంబునం దుడిచికొనుచు గద్గదస్వరంబున మహానిధిం గోలుపోయిన పేదచందంబున నిట్టూర్పులు నిగిడించుచు నర్జునుం డన్న కిట్లనియె.

క. మనసారథి మనసచివుఁడు
మనవియ్యము మనసఖుండు మనబాంధవుఁడున్



మనవిభుఁడు గురుఁడు దేవర
మనలను దిగనాడి చనియె మనుజాధీశా!

క. కంటకులు నృపులు సూడఁగ
మింటం గంపించు యంత్రమీనముఁ గోలన్
గెంటించి మనము వాలుం
గంటిం జేకొంటి మతనికరుణన కాదే?

క. దండి ననేకులతో నా
ఖండలుఁ డెదు రయిన గెలిచి ఖాండవవనముం
జండార్చికి నర్పించిన
గాండీవము నిచ్చెఁ జక్రి గలుగుట నధిపా!

క. దిక్కులరాజుల నెల్లను
మ్రిక్కించి ధనంబు గొనుట మయకృతసభ ము
న్నెక్కుట జన్నము సేయుట
నిక్కము హరి మనకు దండ నిలిచినఁ గాదే.

మ. ఇభజిద్వీర్య మఖాభిషిక్త మగు నీయిల్లాలి ధమ్మిల్లమున్
సభలో శాత్రవులీడ్వవచ్చినవు డాచంద్రాస్య దుఃఖింపఁగా
సభయం బిచ్చి ప్రతిజ్ఞ సేసి భవదీయారాతికాంతాశిరో
జభరశ్రీల హరింపఁడే విధవలై సౌభాగ్యముల్ వీడఁగన్

శా. వైరుల్ గట్టినపుట్టముల్ విడువఁగా వారింప నావల్లభుల్
రా రీవేళ నుపేక్ష సేయఁ దగవే రావే నివారింపవే
లేరే త్రాతలు కృష్ణ యంచు సభలో లీనాంగియై కుయ్యిడం
గారుణ్యంబున భూరివస్త్రకలితం గాఁ జేయఁడే ద్రౌపదిన్;

సీ. దుర్వాసుఁ డొకనాఁడు దుర్యోధనుఁడు పంప
బదివేలశిష్యులు భక్తిఁ గొలువ
జనుదెంచి మనలను బాంచాలియుఁ గుడిచిన
వెనుక నాహారంబు వేఁడికొనినఁ
బెట్టెద ననవుడుఁ బెట్టకున్న శపింతు
ననుచుఁ దోయావగాహమున కేఁగఁ
గడవల నన్నశాకములు దీఱుటఁ జూచి
పాంచాలపుత్రిక పర్ణశాల
తే. లోనఁ దలచిన విచ్చేసి లోవిలోని
శిష్టశాకాన్నలవముఁ బ్రాశించి తపసి
కోపముడిగించి పరిపూర్ణకుక్షిఁ జేసె
నిట్టి త్రైలోక్యసంతర్పి యెందుఁ గలఁడు?

సీ. పందికై పోరాడ ఫాలాక్షుఁ డెవ్వని
బలమున నాకిచ్చెఁ బాశుపతము
నెవ్వనిలావున నిమ్మన దేవేంద్రు
పీఠార్ధమున నుండఁ బెంపుగంటిఁ
గాలకేయ నివాతకవచాది దైత్యులఁ
జంపితి నెవ్వని సంస్మరించి
గోగ్రహణమునాఁడు కురుకులాంభోనిధి
గడచితి నెవ్వని కరుణఁ జేసి
ఆ. కర్ణసింధురాజ కౌరవేంద్రాదుల
తలలపాగ లెల్లఁ దడవి తెచ్చి



యేమహాత్ము బలిమి నిచ్చితి విరటుని
పుత్రి యడుగ బొమ్మపొత్తికలకు.

మ. గురుభీష్మాదులు గూడి పన్నిన కురుక్షోణీశచక్రంబులో
గురుశక్తిన్ రథయంతయై నొగలపైఁ గూర్చుండి యామేటి
నాశరముల్ వాఱక మున్న వారల బలోత్సాహాయురుద్యోగ
తత్పరతల్ చూడ్కుల సంహరించు నమితోత్సాహంబు నా
[కిచ్చుచున్.

మ. అసురేంద్రుం డొనరించు కృత్యములు ప్రహ్లాదుం బ్రవేశించి గె
ల్వ సమర్థంబులు గాని కైవడిఁ గృపాశ్వత్థామగాంగేయ సూ
ర్యసుతద్రోణధనుర్విముక్త బహుదివ్యాస్త్రప్రపంచంబు నా
దెసకున్ రాక తొలంగు మాధవు దయాదృష్టిన్ నరేం
[ద్రోత్తమా.

చ. వసుమతి దివ్యబాణముల వ్రయ్యలువాపి కొలంకు సేసి నా
రసములు మాటుగాఁ బరపి రథ్యములన్ రిపులెల్లఁ జూడ సా
హసమున నీటఁ బెట్టితి రణావని సైంధవుఁ జంపునాఁడు నా
కసురవిరోధి భద్రగతి నండయి వచ్చినగాదె భూవరా.

సీ. చెలికాడ రమ్మని చీరు నన్నొకవేళ
మన్నించు నొకవేళ మఱఁది యనుచు
బంధుభావంబునఁ బాటించు నొకవేళ
దాతయై యొకవేళ ధనము లిచ్చు
మంత్రియై యొకవేళ మంత్ర మాదేశించు
బోధియై యొకవేళ బుద్ధి సెప్పు

సారథ్య మొనరించుఁ జన విచ్చి యొకవేళఁ
గ్రీడించు నొకవేళ గేలిసేయు
తే. నొక్కశయ్యాసనంబున నుండుఁ గన్న
తండ్రికైవడిఁ జేసిన తప్పుఁ గాచు
హస్తములు వట్టి పొత్తున నారగించు
మనుజవల్లభ మాధవు మఱవు రాదు;

క. విజయ ధనంజయ హనుమ
ద్ధ్వజ ఫల్గున పార్థ పాండుతనయ నర మహేం
ద్రజ మిత్రార్జున యంచును
భుజములు దలకడవ రాకపోకలఁ జీరున్.

క. వారిజగంధులు దమలో
వారింపఁగరాని ప్రేమవాదము సేయన్
వారిజనేత్రుఁడు నను దగ
వారిండ్లకుఁ బనుపు నలుక వారింప నృపా!

క. నిచ్చలు లోపలికాంతలు
మచ్చికఁ దనతోడ నాడుమాటలు నాకున్
ముచ్చటలు సెప్పు మెల్లన
నిచ్చలవిడిఁ దొడలమీఁద విచ్చేసి నృపా!

చ. అటమటమయ్యె నాభజనమంతయుభూవర నేఁడునాడుమా
యిటువలె గారవించు జగదీశుఁడు కృష్ణుఁడు లేనిపిమ్మటం
బటుతర దేహలోభమునఁ బ్రాణములున్నవి వెంటఁబోక నేఁ
గటకట పూర్వజన్మమునఁ గర్మము లెట్టివి చేసినాఁడనో



శా. ఆతే రారథికుండ నాహయము లాయస్త్రాసనం బాశర
వ్రాతం బన్యులఁ దొల్లిచంపుఁ గదినిన్వ్యర్థంబులై పోయె మ
చ్చేతోధీశుఁడు చక్రి లేమి భసితక్షిప్తాజ్య మాయావిమా
యాతంత్రోషరభూమిబీజములమర్యాదన్ నిమేషంబునన్.

క. ఏదినమున వైకుంఠుఁడు
మేదినిపైఁ దాల్చినట్టి మేను విడిచినాఁ
డాదినమున నశుభప్రతి
పాదక మగుకలియుగంబు ప్రాప్తం బయ్యెన్.



—* శ్రీ రా మ చ రి త ము *—

మ. అమరేంద్రాశకుఁబూర్ణచంద్రుఁడుదితుండై నట్లు నారాయణాం
శమునం బుట్టె మదాంధరావణశిరస్సంఘాత సంఛేదన
క్రమణోద్దాముఁడు రాముఁడాగరితకుంగౌసల్యకున్ సన్నుతా
సమ నైర్మల్యకతుల్య కంచితజనుస్సంసార సాఫల్యకున్.

మ. సవనత్రాణము దండ్రి వంపఁ జని విశ్వామిత్రుఁడుం దోడ రా
నవలీలం దునుమాడె రాముఁడదయుండై బాలుఁడై కుంతల
చ్ఛవిసంపజ్జితహాటకం గపటభాషావిస్ఫురన్నాటకన్
జవభిన్నార్యమఘోటకం గరవిరాజత్ఖేటకం దాటకన్.

క. గారామునఁ గౌశికమఖ
మారాముఁడు గాచి దైత్యు నధికు సుబాహున్

ఘోరాజిఁ ద్రుంచి తోలెను
మారీచున్ నీచుఁ గపటమంజులరోచున్.

మ. ఒకమున్నూఱుగదల్చి తెచ్చిన లలాటోగ్రాక్షుచాపంబు బా
లకరీంద్రంబు సులీలమైఁ జెఱకుఁగోలం ద్రుంచు చందంబునన్
సకలోర్వీశులుఁ జూడఁగా విఱిచె దోశ్శక్తిన్ విదేహక్షమా
పకగేహంబున సీతకై గుణమణిప్రస్ఫీతకై లీలతోన్.

క. భూతలనాథుఁడు రాముఁడు
ప్రీతుండై పెండ్లియాడెఁ బృథుగుణమణి సం
ఘాతన్ భాగ్యోపేతన్
సీతన్ ముఖకాంతి విజితసితఖద్యోతన్.

క. రాముఁడు నిజబాహుబల
స్థేమంబున భంగపఱిచె దీర్ఘకుఠారో
ద్దామున్ విదళీకృత నృప
ధామున్ రణరంగభీము భార్గవరామున్.

క. దశరథుఁడు మున్ను గైకకు
వశుఁడై తా నిచ్చినట్టివరముకతన వా
గ్దశ నెడక యడవి కనిచెను
దశముఖ ముఖకమలతుహినధామున్ రామున్.

క. జనకుఁడు పనిచిన మేలని
జనకజయును లక్ష్మణుండు సంసేవింపన్
జనపతి రాముఁడు విడిచెను
జనపాలారాధ్య ద్విపదసాధ్య నయోధ్యన్.



క. భరతున్ నిజపదసేవా
నిరతున్ రాజ్యమున నునిచి నృపమణి యెక్కెన్
సురుచిరరుచి పరిభావిత
గురుగోత్రాచలము జిత్రకూటాచలమున్.

ఉ. పుణ్యుఁడు రామచంద్రుఁ డట వోయి ముదంబునఁ గాంచె
దండకా। రణ్యముఁ దాపసోత్తమశరణ్యము సుద్ధత బర్హి
బర్హలా।వణ్యము గౌతమీవిమల చాగకణపర్యటన ప్రభూ
త సా।ద్గుణ్యము నుల్లసత్తరుని కుంజవరేణ్యము నగ్రగ
ణ్యమున్.

సీ. ఆవనంబున రాముఁ డనుజసమేతుఁడై
సతితోడ నొక పర్ణశాల నుండ
రావణుచెల్లెలు రతిఁ గోరి వచ్చిన
మొగి లక్ష్మణుఁడు దాని ముక్కుఁగోయ
నది విని ఖరదూషణాదులు పదునాల్గు
వేలు వచ్చిన రామవిభుఁడు గలన
బాణానలంబున భస్మంబు గావింప
జనకనందన మేని చక్కఁదనము
తే. విని దశగ్రీవుఁ డంగజవివశుఁ డగుచు
నర్థిఁ బంచినఁ బసిఁడిఱ్ఱియై నటించు
నీచు మారీచు రాముఁడు నెఱి వధించె
నంతలో సీతఁ గొనిపోయె నసురవిభుఁడు.

ఉ. ఆయసురేశ్వరుండు వడి నంబరవీథి నిలాతనూజ న
న్యాయము సేసి నిష్కరుణుఁడై కొనిపోవఁగ నడ్డమైన ఘో
రాయతహేతిఁ ద్రుంచె నసహాయత రామనరేంద్ర కార్య ద
త్తాయువుఁ బక్షివేగ పరిహాసితవాయువు సజ్జటాయువున్.

వ. అంత నా రామచంద్రుండు లక్ష్మణసహితుండై సీత వెదక నరుదెంచి నిజకార్యనిహతుండైన జటాయువునకుఁ బరలోకక్రియలు గావించి ఋశ్యమూకంబునకుం జని.

క. నిగ్రహము నీకు వల దిఁక
నగ్రజు వాలిన్ వధింతు నని నియమముతో
నగ్రేసరుఁ గా నేలెను
సుగ్రీవుం జరణఘాతచూర్ణగ్రావున్.

క. లీలన్ రామవిభుం డొక
కోలం గూలంగనేసె గురునయశాలిన్
శీలిన్ సేవితశూలిన్
మాలిన్ వాలిన్ దశాస్యమానోన్మూలిన్.

క. ఇలమీఁద సీత వెదకఁగ
నలఘుఁడు రాఘవుఁడు పనిచె హనుమంతు నతి
చ్ఛలవంతున్ మతిమంతున్
బలవంతున్ శౌర్యవంతుఁ బ్రాభవవంతున్.

క. అలవాటుకలిమి మారుతి
లలితామిత లాఘవమున లంఘించెను శై



వలి నీగణసంబంధిన్
జలపూరిత ధరణి గగన సంధిం గంధిన్.

వ. అట్లు సముద్రంబు దాఁటి సీతం గని హనుమంతుండు దిరిగి చనుదెంచుచు నక్షకుమారాదుల వధియించి.

క. సముదగ్రత ననిలసుతుం
డమరాహిత దత్తవాల హస్తాగ్నుల భ
స్మము సేసె నిరాతంకన్
సమదాసుర సుభటవిగతశంకన్ లంకన్.

వ. ఇట్లు లంకాదహనంబు సేసి వచ్చి వాయుజుండు సీతాకథనంబు సెప్పిన విని రామచంద్రుండు వనచరనాథయూథంబులుం దానును జని చని.

శా॥ ఆ రాజేంద్రుఁడు గాంచె భూరివిధరత్నాగారమున్ మీనకుం
భీరగ్రాహకఠోరమున్ విపులగంభీరంబు నభ్రభ్రమ
ద్ఘోరాన్యోన్యవిభిన్న భంగభవనిర్ఘోషచ్ఛటాంభఃకణ
ప్రారుద్ధాంబరపారమున్ లవణపారావారముం జేరువన్.

వ. కని తనకుఁ ద్రోవ యిమ్మని వేఁడిన నదియు మార్గంబు సూపక మిన్నందిన నారాచపట్టి రెట్టించినకోపంబున.

క. మెల్లని నగవున నయనము
లల్లార్చి శరంబు విల్లు నందినమాత్రన్
గుల్లలు నాఁచులుఁ జిప్పలుఁ
బెల్లలునై జలధి పెద్ద బీడై యుండెన్.

వ. ఇట్లు విపన్నుండగు సముద్రుండు నదులతోఁ గూడి మూర్తిమంతుం డయి చనుదెంచి రామచంద్రుని చరణంబు శరణంబుజొచ్చి యిట్లని స్తుతియించె.

శా. ఓకాకుత్స్థకులేశ యోగుణనిధీ యోదీనమందార నే
నీకోపంబున కెంతవాఁడ జడధిన్ నీ వేమి భూరాజవే
లోకాధీశుఁడ వాదినాయకుఁడ వీలోకంబు లెల్లప్పుడున్
నీకుక్షింబ్రభవించునుండునడఁగున్ నిక్కంబు సర్వాత్మకా.

క. ధాతల రజమున దేవ
వ్రాతము సత్త్వమున భూతరాశిఁ దమమునన్
జాతులఁగా నొనరించు గు
ణాతీతుఁడ వీవు గుణగణాలంకారా!

క. కట్టుము సేతువు లంకం
జుట్టుము నీబాణవహ్ని సురవైరితలల్
గొట్టుము నేలం బడఁ జే
పట్టుము నీయబల నధిక భాగ్యప్రబలన్

ఆ. హరికి మామ నగుదు నటమీఁద శ్రీదేవి
తండ్రి నూగ కేల తా గడింపఁ
గట్టఁ గట్టి దాఁటు కమలాప్తకులనాథ!
నీయశోలతలకు నెలవుగాఁక.

వ. అని విన్నవించిన రామచంద్రుండు సముద్రునిం బూర్వప్రకారంబున నుండు మని వీడుకొల్పె నంత.



క. ఘనశైలంబులఁ దరువులు
ఘనజవమునఁ బెఱికితెచ్చి కపికులనాథుల్
ఘనజలరాశిం గట్టిరి
ఘనవాహప్రముఖ దివిజగణము నుతింపన్.

వ. ఇట్లు సముద్రంబుదాఁటి రామచంద్రుండు రావణు తమ్ముండైన విభీషణుండు శరణంబు వేఁడిన నభయంబిచ్చి కూడుకొని లంకకుఁ జని విడిసి వేడె పెట్టించి లగ్గలు పట్టించిన,

సీ. ప్రాకారములు ద్రవ్వి పరిఖలు పూడిచి
కోటకొమ్మలు నేలఁ గూలఁ ద్రోచి
వప్రంబు లగలించి వాకిళ్లు పెకలించి
తలుపులు విఱిచి యంత్రములు సెఱిచి
ఘనవిటంకంబులు ఖండించి పడవైచి
గోపురంబులు నేలఁ గూలఁ దన్ని
మకరతోరణములు మహిఁ గూల్చి కేతనం
బులు సించి సోపానములు గదల్చి

ఆ. గృహము లెల్ల వ్రచ్చి గృహరాజముల గ్రొచ్చి
భర్మకుంభచయము పాఱవైచి
కరులఁ గొలను సొచ్చి కలఁచినక్రైవడి
గపులు లంకఁ జొచ్చి కలఁచి రపుడు.

వ. అంత నయ్యసురేంద్రుండు పంచినఁ గుంభ నికుంభ ధూమ్రాక్ష విరూపాక్ష సురాంతక నరాంతక దుర్ముఖ ప్రహస్త మహాకాయ ప్రముఖులగుదనుజవీరులుశరశరాసనతోఁ

మరగదాఖడ్గశూలభిండివాలపరశుపట్టిసప్రాసముసలాది సాధనం
బులు ధరియించి మాతంగతురంగస్యందనసందోహంబుతో బవ
రంబు సేయ సుగ్రీవ పవనతనయ పనస గజ గవయ గంధమా
దన నీలాంగద కుముద జాంబవదాదు లారక్కసుల నెక్క
టికయ్యంబులందుఁ దరుల గిరులఁ గరాఘాతంబుల నుక్కడిం
చి త్రుంచి రంత.

క. ఆయెడ లక్ష్మణుఁ డుజ్జ్వల
సాయకములఁ ద్రుంచె శైలసమకాయు సురా
జేయు ననర్గళమాయో
పాయున్ నయగుణవిధేయు నయ్యతికాయున్.

ఆ. రామచంద్రవిభుఁడు రణమున ఖండించె
మేటికడిమి నీలమేఘవర్ణు
బాహుశక్తిపూర్ణుఁ బటుసింహనాదసం
కుచిత దిగిభకర్ణుఁ గుంభకర్ణు.

క. అలవున లక్ష్మణుఁ డాజి
స్థలిఁ గూల్చెన్ మేఘనాదుఁ జటులాహ్లాదున్
ఖలభేదిజ యవినోదున్
బలజనిత సుపర్వ సుభటభావవిషాదున్.

అంత.

క. తనవారందఱు మ్రగ్గిన
ననిమిషపతివైరి పుష్పకారూఢుండై



యనికి నడచి రామునితో
ఘనరౌద్రముతోడ నంపకయ్యము సేసెన్.

వ. అయ్యవసరంబున.

క. సురపతిపంపున మాతలి
గురుతర మగుదివ్యరథముఁ గొని వచ్చిన నా
ధరణీవల్లభుఁ డెక్కెను
ఖరకరుఁ డుదయాద్రి నెక్కుకైవడి దోఁపన్.

వ. ఇట్లు దివ్యరథారూఢుండయి రామచంద్రుండు
రావణున కిట్లనియె.

మ. చపలత్వంబున డాఁగి హేమమృగమున్ సంప్రీతిఁ బుత్తెం
చుటో। కపటబ్రాహ్మణమూర్తివై యబల నాకాంతార
మధ్యంబునం। దపలాపించుటయో మదీయశిత దివ్యామోఘ
బాణాగ్నిసం। తపనం జెగతి నోర్చువాఁడవు దురంతం బెం
తయున్ రావణా.

క. నీచేసినపాపములకు
నీచాత్మక యముఁడు వలదు నేఁడిట నానా
రాచములఁ ద్రుంచి వైచెద
ఖేచరభూచరులు గూడి క్రీడం జూడన్.

వ. అని పలికి.

మ. బలువింటన్ గుణటంకృతంబు నిగుడన్ బ్రహ్మాండ భీమం
బుగాఁ। బ్రళయోగ్రానలసన్నిభం బగు మహాబాణంబునం

ధించి రాజలలాముం డగు రాముఁ డేసె ఖరభాషాశ్రా
వణున్ దేవతా|బలవిద్రావణు వైరిదారజనగర్భస్రావణున్
రావణున్.

క. దశరథసూనుం డేసిన
విశిఖము హృదయంబుఁ దూఱ వివశుం డగుచున్
దశకంధరుండు గూలెను
దశవదనంబులను రక్తధారలు దొరఁగన్.

వ. అంత విభీషణుండు రామచంద్రుని పంపువడసి రావణునకు దహనాదిక్రియలు గావించె; నంత రాఘవేంద్రుండు నశోకవనంబున కేగి శింశుపాతరు సమీపంబునందు,

శా. దైతేయ ప్రమదాపరీత నతిభీతిన్ గ్రంథిబంధాలక
వ్రాతన్ నిశ్శ్వసనానిలాశ్రుకణ జీవంజీవదారామ భూ
జాతన్ శుష్కకపోలకీలిత కరాబ్జాతం బ్రభూతం గృశీ
భూతం బ్రాణసమేత సీతఁ గనియెన్ భూమీశుఁ డాముం
[దటన్.

వ. కని రామచంద్రుండును దాపంబు నొంది భార్య వలన దోషంబు లేకుండుట వహ్నిముఖంబునం బ్రకటంబు సేసి దేవతలపంపున దేవిం జేకొని.

ఉ. శోషితదానవుండు నృపసోముఁడు రాముఁడు రాక్షసేంద్ర
శేషవిభూతిఁ గల్పసమజీవి గమ్మని నిల్పె నర్థిసం[తా
తోషణుఁ బాపశోషణు నదూషణు శశ్వదరోషణున్ మితా
భాషణు నార్యపోషణు గృపాగుణభూషణు సద్విభీషణున్.



వ. ఇట్లు విభీషణసంస్థాపనుండై రామచంద్రుండు సీతాలక్ష్మణసమేతుండై సుగ్రీవ హనుమదాదులం గూడుకొని పుష్పకారూఢుండై వేల్పులు గురియు పువ్వులసోనలం దడియుచుఁ దొల్లి వచ్చిన తెరువుజాడలు సీతకు నెఱిఁగించుచు మగలి నందిగ్రామంబునకు వచ్చె నయ్యవసరంబున.

ఆ. రామచంద్రవిభుఁడు రాకవీనుల విని
భరతుఁ డుత్సహించి పాదుకలను
మోచికొనుచు వచ్చి ముదముతోఁ బురజను
లెల్లఁగొలువ నన్న కెదురు వచ్చె.

వ. వచ్చి పాదుకల ముందట నిడికొని యెడనెడ సాష్టాంగ దండప్రణామంబులు సేయుచు మెల్లనడాసి రామచంద్రుని పాదంబులు దననొసలం గదియించి తచ్చరణ రేణువులు దుడిచి శిరంబునం జల్లికొని తనివి సనక మఱియు నప్పదకమలంబు లక్కున మోపికొనుచు సంతసంపుఁ గన్నీటం గడిగి నేసంబు లరయుచుండె; నంత సీతాలక్ష్మణ సహితుండై విభుండును దన కెదురువచ్చిన బ్రాహ్మణజనంబులకు నమస్కరించి తక్కినవారలచేత మన్ననలు వొంది వారల మన్నించె; నయ్యవసరంబున.

చ. నృపవర పెక్కునాళ్లఁ గొలెనిన్ గనకుండినయట్టి నేఁడు మా|
తపములు పండె నిందఱము ధన్యులమైతి మటంచుఁ బుట్ట
ముల్ | చపలతఁ ద్రిప్పి పువ్వుల వసంతము లాడుచుఁ
బాడుచున్ గత | త్రిపులయి యాడుచుం బ్రజలు దద్ద
యుఁ బండుగు సేసి రెల్లెడన్.

సీ. కవగూడి యిరుదెసఁ గపిరాజు రాక్షస
రాజు నొక్కటఁ జామరములు వీవ
హనుమంతుఁ డతిధవళాతపత్త్రము బట్టఁ
బాదుకల్ భరతుండు భక్తిదేర
శత్రుఘ్నుఁ డమ్ములుఁ జాపంబుఁ గొనిరాఁగ
సౌమిత్రి భృత్యుఁడై చనవుసూప
జలపాత్రి చేఁబట్టి జనకజ గూడిరాఁ
గాంచనఖడ్గ మంగదుఁడు మోవ

ఆ. బసిఁడి కేడె మర్థి భల్లూకపతి మోచి
కొలువఁ బుష్పకంబు వెలయనెక్కి
గ్రహములెల్లఁ గొలువఁ గడునొప్పు సంపూర్ణ
చంద్రుపగిది రామచంద్రుఁ డొప్పె.

వ. ఇట్లు పుష్పకారూఢుండై కపిబలంబులు సేరి కొలువ శ్రీరాముం డయోధ్యకుం జనియె నంతకు మున్న యప్పురంబునందు.

సీ. వీథులు సక్కఁ గావించి తోయంబులు
సల్లి రంభాస్తంభచయము నిలిపి
పట్టుఁజీరలు సుట్టి బహుతోరణంబులుఁ
గలువడంబులు మేలుకట్లుఁ గట్టి
వేదిక లలికించి వివిధరత్నంబుల
ముగ్గులు పలుచందములుగఁ బెట్టి
కలయ గోడల రామకథలెల్ల వ్రాయించి
ప్రాసాదముల దేవభవనములను



తే. గోపురంబుల బంగారుకుండలెత్తి
యెల్లవాకిండ్లఁ గానికలేర్పరించి
జనులు గైసేసి దూర్యఘోషములతోడ
నెదురు నడతెంచి రారాఘవేంద్రుకడకు.

క. సమదగజదాన ధారల
దుమదుమలై యున్న పెద్ద త్రోవలతోడన్
రమణీయమయ్యె నప్పురి
రమణుఁడు వచ్చినఁ గరంగు రమణియపోలెన్.

ఆ. రామభూవరేంద్రు రాకఁ దూర్యములతో
రథగజాశ్వ సుభటరాజితోడ
నమరెఁ బురము చంద్రుఁ డరుదేర ఘూర్ణిల్లు
జంతుభంగమిళిత జలధిభంగి.

వ. ఇట్లొప్పుచున్న యప్పురంబు ప్రవేశించి రాజమార్గంబున రామచంద్రుం డరుగుచున్న సమయంబున.

మ. ఇతఁడే రామనరేంద్రుఁ డీయబలకా యింద్రారి ఖండించె న।
ల్లతఁడే లక్ష్మణుఁ డాతఁడే కపివరుం డాపొంతవాఁడే మరు।
త్సుతుఁ డాచెంగటనా విభీషణుఁ డటంచుం జేతులం
జూపుచున్ । సతులెల్లం బరికించి చూచిరి పురీసౌధాగ్ర
[భాగంబులన్.

వ. ఇట్లు సమస్తజనంబుఁ జూచుచుండ రామచంద్రుండు [illegible]జమార్గంబునం జనిచని.

సీ. పటికంపుగోడలఁ బవడంపువాకిండ్లు
        నీలంపుటరుఁగులు నెఱయఁగలిగఁ
కమనీయవైడూర్యక స్తంభచయముల
        మకరతోరణముల మహితమగుచుఁ
బడగలమాణిక్యబద్ధచేలంబులఁ
        జిగురుఁదోరణములఁ జెలువుమీఱి
పుష్పదామకముల భూరివాసనలను
        బహుతరధూపదీపముల మెఱసి

తే. మాఱువేల్పులభంగిని మలయుచున్న
సతులఁ బురుషులు నెప్పుడు సందడింప
గురుతు లిడరాని ధనములకుప్పలున్న
రాజసదనంబునకు వచ్చె రామవిభుఁడు.

వ. ఇట్లు వచ్చి.

ఉ. తల్లులకెల్ల మ్రొక్కి తమతల్లికి వందనమాచరించి య
ల్లల్ల బుధాళికిన్ వినతుఁడై చెలికాండ్రను దమ్ములం బ్రసం
ఫుల్లతఁ గౌఁగిలించుకొని భూవరుఁడోలి గృపారసంబు రం
జిల్లఁగఁజాల మన్ననలు సేసెనమాత్యులఁ బౌరభృత్యులన్.

వ. తత్సమయంబునఁ దల్లులు.

చ. కొడుకులఁ బెద్దకోడలును గొబ్బున మ్రొక్కిన నెత్తి
చేతులం । బుడుకుచు మోములుం దలలు బోరన ముద్దు
లు గొంచు నవ్వుచుం । దొడలకు వారి రాఁదిగిచి తో



గఁగ జేసిరి నేత్రధారలన్ । వెడలినప్రాణముల్ దగఁ
బ్రవిష్టములయ్యె నటంచు నుబ్బుచున్.

అంత వసిష్ఠుఁ డరుగుదెంచి శ్రీరామచంద్రుని జటాబంధంబు విడిపించి కులవృద్ధులుం దానును సమంత్రికంబుగ దేవేంద్రుని మంగళస్నానంబు సేయించు బృహస్పతిచందంబున సముద్రనదీజలంబుల నభిషేకంబు సేయించె. రఘువరుండును సీతాసమేతుండై జలకంబులాడి మంచి పుట్టంబులు గట్టికొని కమ్మనిపువ్వులు దుఱిమి సుగంధంబు లలందికొని తొడవులు దొడిగికొని తనకు భరతుండు సమర్పించిన రాజసింహాసనంబునం గూర్చుండి యతని మన్నించి కౌసల్యకుఁ బ్రియంబు సేయుచు జగత్పూజ్యంబుగా రాజ్యంబు సేయుచుండె నపుడు.

సీ. కలఁగుటెల్లను మానెఁ గంధు లేడింటికిఁ
        జలనంబు మానె భూచక్రమునకు
జాగరూకత మానె జలజలోచనునకు
        దీనభావము మానె దిక్పతులకు
మాసియుండుట మానె మార్తాండవిధులకుఁ
        గావిరి మానె దిగ్గగనములకు
మడిగి పోవుట మానె నుర్వీరుహంబుల
        కడఁగుట మానెఁ ద్రేతాగ్నులకును

ఆ. గడఁదివ్రేఁగు మానెఁ గరి గిరి కిటి నాగ
కమఠములకుఁ బ్రజలకలఁక మానె
రామచంద్రవిభుఁడు రాజేంద్రరత్నంబు
ధరణిభరణదీక్షఁ దాల్చునపుడు.

క. తండ్రిక్రియ రామచంద్రుఁడు
దండ్రుల మఱపించి ప్రజలఁ దా రక్షింపం
దండ్రుల సందలు మఱచిరి
దండ్రిగదా రామచంద్రధరణిపుఁ డనుచున్.

మఱియు నా రామచంద్రుండు రాజర్షి చరిత్రుండును నిజధర్మనిరతుండును నేకపత్నీవ్రతుండును సర్వలోక సమ్మతుండును నగుచు ధర్మవిరోధంబు గాకుండఁ గోరిక లనుభవించుచుఁ ద్రేతాయుగంబైనఁ గృతయుగధర్మంబుఁ గావించుచు బాలమరణంబు మొదలగు నరిష్టంబులు ప్రజలకు గలుగకుండ రాజ్యంబు సేయఁదొడంగె.

---

